PSL02A138

# సందేశం

మార్క్సిస్టు సిద్ధాంత - రాజకీయ మాసపత్రిక

భాద్రపదం 1883 [సెప్టెంబరు 1961]

## ఈ సంచికలో



సంపుటి 8 ★ సంచిక 9 ★

PSL02A138

# సందేశం

సంపాదకవర్గం :
కంభంపాటి సత్యనారాయణ
కడియాల గోపాలరావు
మహీధర రామమోహనరావు

సంపుటి 8 భాద్రపదం 1883 (సెప్టెంబరు 1961) సంచిక 9

## అస్సాం సమస్య

అజయఘోష్

కచార్ సంగ్రామ పరిషత్తుకూ యూనియను హోంశాఖా మంత్రి శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రికి జూలై 2 న జరిగిన సంప్రతింపులు విఫలమైపోవడం విచారకరం. అయినా తాము కొన్ని వారాల క్రితం నిలిపివేసిన సత్యాగ్రహాన్ని తిరిగి ప్రారంభించబోమని పరిషత్తుచేసిన నిర్ణయాన్ని ఎల్లరూ అభినందిస్తారు. గత సాలున గౌహతీలో జరిగిన కాల్పులపై నియమించబడిన విచారణసంఘం నివేదికను ప్రభుత్వం ప్రకటించనందుకూ, శ్రీ శాస్త్రి పధకానికి వ్యతిరేకంగా జూలై 4 న జరపదలచిన హర్తాళును గౌహతీ విద్యార్థుల కార్యాచరణ సంఘం ఉపసంహరించుకోవడం కూడా అభినందనీయమే.

అయినా సమీప భవిష్యత్తులో అస్సాములో మామూలు పరిస్థితులు నెలకొనగలవనే ఆశ కనబడదు. భాషాసమస్య పరిష్కారం కానేలేదు. అదీగాక అస్సాం అఖిలపక్ష కొండజాతి నాయకుల సమావేశం శ్రీ శాస్త్రిపధకాన్ని నిరాకరించింది. "స్కాట్లండు మాదిరి అధినివేశ ప్రతిపత్తి" నివ్వడం బాగుంటుందనే శ్రీ నెహ్రూ సూచనను కూడా వారు నిరాకరించారు. ప్రత్యేకంగా కొండరాజ్యాల యూనియనుగా కొత్త రాష్ట్రాన్ని ఏర్పరచి తీరవలసిందేనని వారి తీర్మానం చెబుతూంది. అస్సాం నుంచి విడిపోవాలనే నిర్ణయాన్ని ప్రకటించేందుకు, అహింసాయుత సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించేటందుకు కొండజాతి ప్రజలు సన్నద్ధం కావాలని వారు పిలుపునిచ్చారు. 1960 అక్టోబరు 24 న అస్సాం అసెంబ్లీ ప్రభుత్వ భాషాచట్టం చేసింది. దానికి నిరసనగా ఈ ఏడాది అక్టోబరు 24 న అస్సెంబ్లీ, పార్లమెంటు, బోర్డులు, వివిధ ప్రభుత్వ సంస్థలలోవున్న కొండ

జాతి ప్రతినిధులంతా రాజీనామా లివ్వాలని ఆదేశిస్తూ సమావేశం తీర్మానించింది.

అస్సాంరాష్ట్రంలో నేడున్న పరిస్థితులకు కారణం ఏమిటి? బయలు దేరిన సమస్యల్ని పరిష్కరించడమెల్లాగ? ఒక్క అస్సాముకే కాదు, దేశంలోని అన్ని పార్టీలకూ, దేశంలో ఐక్యతనూ, ప్రజాతంత్రాన్నీ కాపాడుకోవాలనుకొనే వారందరికీ ఈ ప్రశ్నలు చాల ప్రధానము లైనాయి. జూన్ 18 నుండి 22 వరకూ బెంగుళూరులో జరిగిన భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి ఈ ప్రశ్నలకు సమాధానం ఇవ్వడానికి ప్రయత్నించింది. వారి సలహాలు ఒక తీర్మానం రూపంలో పత్రికలకు ఇచ్చారు.

ఒక ఏడాది క్రితం బ్రహ్మపుత్ర లోయలో ఘోరమైన కల్లోలాలు జరిగినాయి. వానిలో ఎక్కువగా నష్ట పడింది బెంగాలీలు. ఆ ఘటనలింకా ప్రజలు మరచిపోలేదు. కొన్ని డజన్ల మంది మరణించారు. 50 వేలమందే కొంపా గోడీ కోల్పోయారు. ఆస్తి ఎంతో నష్టమయింది. ఆడవాళ్ళని అవమానించిన వార్తలు వచ్చాయి. కొట్లాటలు జరిగిన విధానం చూస్తే, వానికి జాగ్రత్తగా తయ్యారీలు చేసుకొని ప్రారంభించినట్లు కనబడుతుందే కాని యాదృచ్ఛిక సంఘటనగా తోచదు.

ఆ సందర్భంలో అస్సాం ప్రభుత్వం తీసుకొన్న ధోరణి చూస్తే అనుమానాస్పదంగా కనబడుతుంది. కొంపలంటించి జనాన్ని చంపుతూంటే పోలీసులు కళ్ళప్పగించి చూసిన వార్తలు చాలావినబడ్డాయి. అనేక పట్నాలలో పోలీసు సాయం కోరినా, వినిపించుకోలేదు.

ఈ కొట్లాటలకు మూలకారణాలను పరిశీలించడం ఇక్కడ సాధ్యం కాదు. కాని కొన్ని ఘటనలనుమాత్రం పేర్కొనకతీరదు.

## అస్సాములో భాషలు

అస్సాములో అస్సామీ భాషను ప్రభుత్వభాషగా ప్రకటించవలసిందని అస్సామీ ప్రజలు చాల కాలంగా కోరుతున్నారు. రెండవ సాధారణ ఎన్నికల అనంతరం ఈ కోరిక బాగా బలపడింది. అస్సాం సాహిత్యసభ 1960 లో ఈ సమస్య తీసుకొంది. ఈ సంవత్సరం లోపల నేదానిని పరిష్కరించాలని ఆందోళన చేసింది.

కచార్ జిల్లా నుంచి దీనికి వ్యతిరేకత వచ్చింది. అక్కడ బెంగాలీ భాష మాట్లాడేవారు అత్యధిక సంఖ్యలో వున్నారు. బ్రహ్మపుత్రనదీ లోయలో ఇతరత్రావున్న బెంగాలీలూ కొండ జాతి ప్రజల నాయకులూ కూడ దీనిని వ్యతిరేకించారు. ఇప్పుడున్నట్లే ఇంగ్లీషు ప్రభుత్వ భాషగా వుండాలనీ, లేదా అస్సామీ, బెంగాలీ భాషలు రెండింటినీ ప్రభుత్వ భాషలు చెయ్యాలని బెంగాలీల కోరిక. అంటే. అస్సాము ద్విభాషా రాష్ట్రంగా వుండాలి. అస్సామీతో పాటు

బెంగాలీకి సమాన హెూదానివ్వాలి. అయితే కొండ జాతులవారి నాయకులకు ఈ పరిష్కారం వప్పుదల కాలేదు. హిందీ ప్రభుత్వభాష అయ్యే వరకూ ఇంగ్లీషే వుండాలనీ,అస్సామీ తటస్థ భాషగా, కష్టమో సులభమో అందరికీ ఒకే విధంగా వుండేది కావాలనీ వారుకోరేరు.

1951 జనాభాలెక్కల ప్రకారం అస్సాంలో 90.4 లక్షలమంది జనం వున్నారు. ఆ లెక్కలప్రకారం అక్కడ వివిధభాషలు మాట్లాడేవారి సంఖ్య ఈవిధంగా వుంటుంది.

| | |
|---|---|
| అస్సామీ | 49,48,092 |
| బెంగాలీ | 16,54,904 |
| హిందీ | 3,22,965 |
| గారో | 2,33,399 |
| ఖాసీ | 2,28,085 |
| లషై | 1,59,297 |
| మికర్ | 1,23,725 |
| బోడో | 1,16,884 |
| కచారీ | 50,572 |
| ఒరియా | 1,12,039 |
| నేపాలీ | 1,11,755 |

అస్సాంలో వున్న ప్రత్యేక లక్షణం ఏమిటంటే, అక్కడున్న శ్రామిక వర్గంలో అధికభాగం అస్సామీయేతరులు. ఆ రాష్ట్ర రాజకీయాలలో వారి ప్రభావం అల్పం.

కాచార్‌లోనే గాకుండా బ్రహ్మపుత్ర నదీలోయలోని కొన్ని ఇతర పట్టణాల్లోనూ, ప్రాంతాల్లోనూ బెంగాలీలు పెద్ద సంఖ్యలో వున్నారు. పైదానిని బట్టి ఒకటి గ్రహించవచ్చును. అస్సాంలో చాలా భాషలు మాట్లాడుతారు. ఆ రాష్ట్ర ప్రజలలో అస్సామీభాష మాట్లాడేవారి సంఖ్య 55 శాతం వుంది. బెంగాలీలది 18 శాతం వుంది.

అయితే ఈ అంకెలు సరియైనవి కావనే పేచీ ఒకటుంది. జనాభా లెక్కలలో చూపినదానికన్నా అస్సామీల సంఖ్య తక్కువ, బెంగాలీల సంఖ్య ఎక్కువ వున్నదని బెంగాలీలు అంటారు. రాష్ట్ర పునర్విభజన సంఘం వారే ఈ విషయాన్ని సూచనగా తెలిపేరు. "1931 నాటి లెక్కలకీ ఈనాటి లెక్కలకీ బాగా తేడా కనిపిస్తూంది. కారణం ఏమిటో మరి."

1951 కి పూర్వం లెక్కలన్నీ తప్పు లంటారు, అస్సామీయులు. జనాభా లెక్కలు తీసిన వుద్యోగులలో చాల ఎక్కువమంది బెంగాలీలనీ, వారు పనికట్టుకొని అస్సామీభాష మాట్లాడేవారి సంఖ్యను తగ్గించేశారనీ అంటారు.

ఇక్కడవున్న సమస్య కేవలం లెక్కలకి సంబంధించినదేకాదు. దానికి చారిత్రక పునాదులున్నాయి. దానికితోడు ఆర్థిక-సాంఘిక సమస్యలు అనేకం వాని తీవ్రతకు తోడ్పడ్డాయి

అస్సాము బ్రిటిష్‌వాళ్ళ అధీనంలోకి వచ్చింది 1826 లో. అప్పటికప్పుడే బెంగాల్ వాళ్ళ చేతిలో 70 ఏళ్ళనుంచి వుంది. బెంగాలీ మేధావులు ఇంగ్లీషు బాగా నేర్చుకొని

ఇంగ్లీషువాళ్ళతో పాటే అస్సాములోకి వచ్చారు. మంచి మంచి పరిపాలనా స్థానాలలో కుదురుకొన్నారు. అనేక ప్రొఫెషన్లలోకూడ వారిదే బలం. బెంగాలీలు అస్సామీయుల యెడ చాల నిరసన చూపారు. వారిభాష బెంగాలీభాషలోని ఒక మాండలికం మాత్రమేనన్నారు. అస్సామీయులు ఆర్థికంగా వెనకబడి వున్నారు. చాల కాలంవరకు వారి భాష కో స్థానం అంటూ లేకుండా చేశారు. బెంగాలీల ఈ తలబిరుసు తనాన్ని అస్సామీయులు అసహ్యించు కొన్నారంటే ఆశ్చర్యంలేదు. ఇక కొండజాతుల వారిమాట. ఆ ప్రాంతాలెన్నడూ అస్సాములో భాగాలుగా వుండలేదు. బెంగాలీలన్నా, అస్సామీయులన్నా కూడ వాళ్ళకి అసహ్యమే. తమని నాయిద్దరూకూడ తక్కువగా చూస్తారనీ, ఇద్దరూ తమని పీక్కుతినేవారే ననీ వారికి కోపం.

ఈ పరిస్థితులలో పుట్టిన ద్వేషాలు ఈనాటికీ కొనసాగుతున్నాయి. పరిస్థితులు మారేయి. అస్సామీభాష వృద్ధి పొందింది. కొండజాతి ప్రజలూ ముందుకువచ్చారు అయితే,పరిశ్రమలు వృద్ధి పొందలేదేమో, ప్రభుత్వోద్యోగాలకోసమూ, ప్రొఫెషన్సు (టీచరు, లాయరు వగైరా) లోనూ తీవ్రమైన పోటీ ఏర్పడింది.

అస్సామీభాష మాట్లాడే ప్రజలలో చైతన్యం కలుగుతూంది. ఆ సందర్భంలో అస్సామీ భాషను ప్రభుత్వ భాషగా చెయ్యాలనే కోరిక వారిలో బలపడడంలో ఆశ్చర్యంలేదు. ఐతే ఈ సమస్యను తొందరపడి ఏ ఒక్కరో తేల్చివేసే పుట్టిది కాదు. అక్కడ బహు భాషలు మాట్లాడే జనంవున్నారు. ఎంతో ఓర్పుగా చర్చలు నడపాలి. అభిప్రాయాలు గూళ్ళు కట్టుకో కూడదు. అందరూ సహనభావం, సద్భావంతో మెలగాలి.

ఈ చిక్కుసమయంలో అస్సాం కాంగ్రెసు కమిటీగాని, అస్సాం ప్రభుత్వంగాని సరిగ్గా వ్యవహరించలేదు. బ్రహ్మపుత్రనదీ లోయనుంచి వచ్చిన అనేకమంది కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు పార్టీ నాయకులు బెంగాలీల యెడ ద్వేషభావాన్ని రెచ్చగొట్టారు. అస్సాంలోనూ, పశ్చిమ బెంగాలులోనూ కూడ బెంగాలీలు అడ్డుపడి అస్సామీయులకు న్యాయంగా రావలసిన స్థానాన్ని రాకుండా చేస్తున్నారని వారు నిందించేరు. కొన్ని ప్రదేశాలలో బెంగాలీ నాయకులు, అస్సామీ వ్యతిరేక ప్రచారమూ చేశారు. షిల్లాంగులో బెంగాలీలూ, కొండజాతులవారూ కలిసి పెద్ద వూరేగింపు లేవదీయడమూ, అందులో అస్సామీభాషను గురించి నిందాపూర్వకములయిన నినాదా లివ్వడమూ వార్త వినగానే ద్వేషాలు మరీ ఎక్కువైనాయి. బ్రహ్మపుత్ర నదీలోయలో ఆందోళన త్వరలోనే బెంగాలీ వ్యతిరేకాందోళనగా తయారయింది.

గత సంవత్సరం జరిగిన దుర్ఘటనలు దాని ఫలితమే. దేశ విభజనానంతరం

అటువంటిదుర్ఘటనలెన్నడూజరగలేదు. లక్షలకొలది మంది అమాయక స్త్రీ - పురుష, బాలశిశువులు ఎన్నెన్నో బాధలకు గురిఅయ్యారు. సమస్యను న్యాయంగానూ, సామరస్య పూర్వకంగానూ పరిష్కరించడానికి అటు కేంద్ర ప్రభుత్వమూ, ఇటు రాష్ట్ర ప్రభుత్వమూ కూడా అసమర్థములయాయి. వాని చేతగానితనానికీ, అల్ప సంఖ్యాకులకు రక్షణ లివ్వలేకపోవడానికీ ఈ ఘటనలు ప్రత్యక్ష నిదర్శనం.

## ప్రభుత్వ భాషా చట్టం

పైన చెప్పిన కొట్లాటలవేడి చల్లారకపూర్వమే ప్రభుత్వం శాసన సభలో ప్రభుత్వ భాషను గూర్చిన బిల్లును ప్రవేశ పెట్టింది. కేంద్ర ప్రభుత్వం వద్దన్నప్పటికీ వినకుండా, భాషా సమస్యను సత్వరం పరిష్కరించకుంటే ఆకొట్లాటల్లో కొంపాగోడీ కోల్పోయిన కాందిశీకుల పునరావాస కల్పన కష్టం అయిపోతుందని చెప్పి బిల్లును 1960 అక్టోబరు 24 న ఆమోదింపచేశారు.

బిల్లులో మంచి అంశాలైతే చాలానే వున్నాయి. అస్సాం రాష్ట్రంలో ప్రభుత్వ వ్యవహారాలలో అస్సామీ భాషనూ, హిందీ ఆస్థానంలోకివచ్చేవరకూ ఇంగ్లీషునూ వుపయోగించాలన్నారు అయితే కాచార్‌లో జిల్లా స్థాయివరకూ బెంగాలీని వుపయోగించాలన్నారు అయితే దీని కో మినహాయింపు పెట్టారు. కాచార్ జిల్లాలోని మహకుమా పరిషత్తుగాని, మునిసిపల్ బోర్డుగాని ఎక్కడన్నా మూడింట రెండువంతుల మెజార్టీతో ఆ పరిషత్తు ప్రాంతంలోనో, బోర్డు ప్రాంతంలోనో అస్సామీభాషను పరిపాలనాభాషగా గుర్తించి, వ్యవహరించవచ్చునన్నారు.

ఇది చాలా అనిష్టకరమైన క్లాజు. దీనిని అసెంబ్లీలో కమ్యూనిస్టుపార్టీ గట్టిగా ప్రతిఘటించింది. దానిని కాచార్‌నుంచి ఎన్నుకోబడిన బెంగాలీ కాంగ్రెసు శాసనసభ్యులు సహా ప్రతిఘటించారు. కాని తన మొరటు సంఖ్యాబలంతో కాంగ్రెసు పార్టీ దానిని నెగ్గించుకొంది. గెజెట్లను, బిల్లులను, చట్టాలను అస్సామీ, ఇంగ్లీషు భాషల్లోనే కాకుండా, బెంగాలీలో కూడా ప్రచురించాలనే సవరణను కమ్యూనిస్టులు తెచ్చారు. దానినికూడా ప్రభుత్వం నిరాకరించింది.

కొండజాతులవారి నాయకులు కూడా బిల్లును వ్యతిరేకించారు. కారణం ఇంతక్రితమే చెప్పేను. హిందీ వచ్చేవరకూ ఇంగ్లీషే రాష్ట్రంలో ప్రభుత్వ భాషగా వుండాలనేది వారి అభిప్రాయం. వారా చట్టానికి వ్యతిరేకంగా పెద్ద ప్రదర్శననే ఏర్పాటు చేశారు.

బిల్లు ఆమోదించబడ్డాక, కాచార్ ప్రజలలో నిరాశా, నిస్పృహా, ఆవేశం, కోపం పుంజుకొన్నాయి. మహకుమా పరిషత్‌లకు సంబంధిం

చిన క్లాజు సహాయంతో కాచార్‌నుంచి బెంగాలీకి ఉద్వాసన చెప్పేస్తారని వారు భయపడసాగేరు. వారికి ఆర్థిక మైనఅసంతృప్తికూడావుంది కాచార్ బెంగాలీ మాట్లాడే ప్రజలున్న జిల్లా అనే ఈర్ష్యతో, దానిని అభివృద్ధి చేయకుండా ప్రభుత్వం టలాయిస్తూందనే అసంతృప్తివుంది. ఉద్యోగాలూ మొదలైన విషయాలలో అస్సామీ ప్రభుత్వం బెంగాలీలయెడ వివక్షత చూపుతూందనేది ఒకటుంది.

ఈ దశలో సంగ్రామ పరిషత్తు ఏర్పడింది. దానిలో స్వతంత్రులు చాల మందున్నారు. కొట్లాట సందర్భంలో తమ రాష్ట్రనాయకులు చూపిన దృక్పథాన్ని వ్యతిరేకిస్తూ రాజీనామాలిచ్చిన ప్రజా సోషలిస్టుపార్టీ నాయకులూ, 'వ్యక్తిగత హెూదాలో' కొందరు కాంగ్రెసువాదులూ దానిలో చేరారు. విజ్ఞప్తులకూ, అర్జీలకూ, దరఖాస్తులకూ ప్రయోజనం లేకపోయిందనీ, ఇంక 'హింసారహిత ప్రత్యక్ష చర్యలు' ప్రారంభించడమే మిగిలిందనీ వారు ప్రకటించారు. రాష్ట్రానికంతకూ మూడో వ్యవహారభాషగా బెంగాలీ వుండాలనేది వారి డిమాండు. కాచార్‌లోనూ, అస్సాంలో ఇతరత్రానూ వున్న బెంగాలీలంతా దానిని బలపరిచారు. ఆ నినాదం కేంద్రంగా కాచార్‌లో పెద్ద ప్రజావుద్యమమే తలఎత్తింది. జిల్లా అంతటా, మారుమూలగ్రామాలకంటూ అది వ్యాప్తి చెందింది.

## సిల్చార్‌లో కాల్పులు

దానికి సమాధానంగా అస్సాం ప్రభుత్వం కాచార్‌లో పెద్దబలగాన్ని కూర్చి, దానినొక సాయుధ శిబిరంగా మార్చివేసింది. ఒక ఏడాది క్రితం హత్యలూ,గృహదహనాలూ పెద్ద ఎత్తున సాగిపోతూంటే పట్టనట్టుచూస్తూవుండిపోయిన ప్రభుత్వ బలగం ఈ మారు సిల్చార్ అనే చోట శాంతియుతంగా వున్న సత్యాగ్రహులమీద కాల్పులు కాల్చింది. తత్ఫలితంగా పదకొండుగురు మరణించారు వారిలో ఒక చిన్న పిల్లవుంది. మరి ముప్ఫయ్యిద్దరు తర్వాత మరణించారు.

ఈ దారుణమైన కాల్పులకు దేశం నలుమూలలా ప్రజలు ఉద్రిక్తులయ్యారు. పశ్చిమబెంగాల్‌లో తీవ్ర ఆవేదనచెలరేగింది. అదిదుర్గాపూర్‌లో జరిగినఅఖిలభారతకాంగ్రెసుకమిటీసమావేశంలో స్పష్టంగా వ్యక్తమయింది.

భారత కమ్యూనిస్టు పార్టీ అస్సాం రాష్ట్రసమితి జోర్హాత్‌లో సమావేశం అయి కాల్పులనుచాలనిశితంగాఖండించింది. కాల్పులపై న్యాయవిచారణ జరిపించి, హత్యలకు కారకులయిన వారిని కఠినంగా, ఇతరులకు బుద్ధి కలిగేటట్లు శిక్షించాలని డిమాండు చేసింది.

కాల్పులవలన అస్సాం ప్రభుత్వం అనుకొన్నదానికి ప్రత్యక్ష విరుద్ధమైన ఫలితం కలిగింది. కర్ఫ్యూ, నిషేధాజ్ఞలను జిల్లాలో ప్రతిచోటా ధిక్కరించారు. కాంగ్రెసువాదులతో

సహా కాచార్ శాసనసభ్యులంతా రాజీ నామా లిచ్చారు కాచార్ కాంగ్రెసు సంగ్రామ పరిషత్తు కోరికలను పూర్తిగా సమర్థించింది. పికెటింగ్‌కు వేలకొలది వలంటీర్లు పూనుకొన్నారు. ప్రభుత్వ పనులన్నీ బందయ్యాయి. వుద్యమం పూర్తిగా శాంతియుతంగానే సాగింది.

కాచార్‌లోని హిందూ – ముస్లిం ప్రజలు యావన్మందీ అస్సాంలో బెంగాలీకి తగుస్థానం వుండాలని డిమాండు చేశారు. అస్సామీ భాషకు బెంగాలీతో సమానమైన ప్రతిపత్తి వుండేటట్లు అస్సామును ద్విభాషా రాష్ట్రంగా చేయడానికి అస్సాము ప్రభుత్వమూ అంగీకరించదు. అస్సాము ప్రజలూ అంగీకరించరు. అది స్పష్టమే. అయితే ఆ కోరికను తెగే వరకూ లాగడం అంటే కాచార్‌ను అస్సాంనుంచి వేరు చెయ్యాలనడమే. అది కాచార్‌లోనే అంగీకారం పొందదు. బెంగాలీభాష మాట్లాడే దైనా కాచార్‌ను పశ్చిమ బెంగాల్‌తో చేర్చడం సాధ్యంకాదు. రెంటికీ భౌగోళిక సాన్నిహిత్యం లేదు. అందుచేత అస్సాంనుంచి కాచార్‌ను విడదీస్తే దానిని కేంద్రపాలిత ప్రాంతంగానైనా వుంచాలి. లేదా త్రిపురా, మణిపూర్‌లతో కలిపి కొత్త రాష్ట్రం (పూర్వాచల్) చెయ్యాలి. అల్లాంటి కొత్త రాష్ట్రం ఏర్పడితే దానిలో బెంగాలీలకు ప్రాబల్యం ఏర్పడుతుందనే భయంతో త్రిపురా, మణిపూర్‌లలోని కొండతెగలు దానికి సమ్మతించరు.

కాచార్‌లోకూడ చాలమంది ప్రజలు అస్సామునుంచి విడబడడానికి అంగీకరించరు. కాచార్ జనాభాలో ముస్లిములు మూడోవంతుకు పైగా వుంటారు. వారెవ్వరూ విభజనకు అంగీకరించరు. కొత్త రాష్ట్రంలో భాగమే అయినా, కాచార్ వేరుగా వున్నా అస్సామీ హిందువులకన్నా తీవ్రమతధోరణి ప్రకటించే బెంగాలీ హిందువులు తమని నిలవనియ్యరని వారి భయం. సంగ్రామ పరిషత్తు నాయకులలో చాలమంది పూర్వచరిత్ర నెరిగిన అల్పసంఖ్యాక ప్రజలకు వారి మీద విశ్వాసాలు లేవంటే ఆశ్చర్యం లేదు.

కాచార్‌లోని కొన్ని ప్రాంతాలలో పెద్ద సంఖ్యలోవున్న మణిపురీ ప్రజలు కూడా అస్సాంనుంచి కాచార్ విడిచి పోయే ఏ విధమైన ప్రయత్నాన్నీ బల పరచరు.

సంగ్రామ పరిషత్తు ప్రారంభించిన వుద్యమం కాచార్ విడిచిపోవడానికి దారితీస్తుందేమోనని ముస్లిముల లోనూ, మణిపురీలలోనూ వున్న భయాన్ని ప్రభుత్వంలోని వున్నతోద్యోగులు తెలివిగా ఉపయోగించుకొని మత ద్వేషాలను రెచ్చగొట్టేరు. అస్సామంతకూ బెంగాలీ మూడో ప్రభుత్వ భాషగా అంగీకరించకపోతే, కాచార్‌ను విడతియ్యాలన్న సంగ్రామ పరిషత్తులోని కొందరి వాచాలత్వం వారికి తోడ్పడింది.

## ఆదివాసి రాజ్యాల యూనియన్

ఈ లోపున కొండప్రాంతాలలో చాల ముఖ్యమైన పరిణామాలు జరుగుతున్నాయి. భాషాబిల్లు ఆమోదించబడిన కొద్దిరోజుల అనంతరం హాఫ్ లాంగ్ అనేచోట కొండనాయకులు సమావేశమై ప్రత్యేకంగా పార్వతేయ రాష్ట్రం ఏర్పరచాలనీ "అదొక్కటే కొండప్రజల ప్రయోజనాలనుకాపాడి, వారి న్యాయమైన అభీష్టాలను తృప్తి పరచగలదు" అనీ తీర్మానించారు. 1961 ఏప్రిలులో అఖిలపక్ష కొండ జాతి నాయకుల మహాసభ షిల్లాంగులో జరిగింది. ఆ సమావేశం తరపున ప్రధాని నెహ్రూకు 1961 మే 16 న ఒక నివేదన సమర్పించబడింది. స్వాతంత్ర్యంవచ్చాక అస్సామీ ప్రభుత్వం తన నడవడికమూలంగా కొండ ప్రజల విశ్వాసాన్ని కోల్పోయిందన్నారు. ఆ నివేదనలోని కొన్ని ఆరోపణలు యివి :

— అస్సామీయులు "రాష్ట్ర ప్రజలలో ఏభయికి తక్కువగానేవున్నా రాష్ట్రశాసనసభలో 60 శాతం వారికుంది. "రాజకీయపు ఎత్తుగడలు, ఒత్తిడిద్వారా 70 శాతం స్థానాలు వారి అధీనంలో వున్నాయి. రాష్ట్ర మంత్రిమండలిలో 90 శాతం స్థానాలు వారివే". అదిగాక "రాష్ట్రంలోని ప్రభుత్వోద్యోగాలలో 70 శాతానికి పైగా వారే తీసుకొన్నారు.

—"ఒకటో ప్రణాళికను, రెండో ప్రణాళికను రూపొందించటంలోనూ, అమలు జరపడంలోనూ కొండ ప్రాంతాల యెడ సవతితల్లి ప్రేమనే కనబరిచారు. ఇంచుమించు అన్ని పెద్ద అభివృద్ధి కార్యక్రమాలూ, పెద్ద సాంకేతిక, తదితర పాఠశాలలు అన్నీ అస్సాంలోయకే పరిమితమైవున్నాయి. పర్వతప్రాంతాలలో ప్రధానమైన పరిశ్రమలు ఏ ఒక్కటీ నిర్మించబడలేదు. "ప్రధానమైన రోడ్లువేసి సంబంధాలు కలపడానికి కూడ బాగా జాగు చేశారు. పర్వత ప్రాంతాలలో ఒక్క ప్రభుత్వ కాలేజీకూడ ఏర్పరచలేదు. పరిశ్రమలు నిర్మించలేదు." అదీగాక రెండో ప్రణాళికలో ఏర్పాటు చేస్తామన్న 61 ఆస్పత్రులలో... ఆరు మాత్రమే పూర్తి అయినాయి.

— ప్రత్యేకంగా కొండ ప్రాంతాలను అభివృద్ధిపరచేందుకై "కేంద్ర ప్రభుత్వం కేటాయించిన ధనాన్ని అనేక సాకులుచూపి పక్కనే వున్న మైదాన ప్రాంతాలకు వుపయోగించారు."

— షిల్లాంగులోనూ, చుట్టు ప్రక్కలావున్న మంచి భూములన్నింటినీ కొండప్రజలనుంచి తీసేసుకొని వానిని "చాలవరకు అస్సామీ కుటుంబాలకు ఇచ్చింది."

అస్సాం భాషాచట్టం "కొండ ప్రజలకు పుండుమీద కారం చల్లినట్లు చేసింది." "రాష్ట్రంలోవున్న ఇతరుల మీద అస్సామీయులుపెత్తనం చేయ చూస్తున్నార"ని నమ్మకం కలిగింది. అందుచేత కొండప్రజలు అస్సాం నుంచి విడిపోగోరుతున్నారు. కొత్త

రాష్ట్రాన్ని ఏర్పరచాలంటున్నారు. దాని జనాభా పదిలక్ష లుంటుంది. నాగ రాష్ట్రాన్ని ఏర్పరచిన విషయాన్ని వుదహరిస్తూ ఆ విజ్ఞప్తిలో ఇల్లా వ్రాశారు: "అది ఇప్పుడు మేము ఏర్పరచమంటున్న తూర్పు సరిహద్దు రాష్ట్రంకన్నా చిన్నది. ఇంతకన్న అది స్వతంత్రంగా నిలబడగల దేం కాదు. "అందుచేత" నిలబడలేదనే పేరుతో "కొండరాజ్యాల యూనియనును ఎందుకు నిరాకరించాలి ?

ఏర్పరచాలనే కొత్తరాష్ట్రంలో భాషను గురించి విజ్ఞప్తి ఇల్లా చెప్తూంది: "హిందీ బాగా ప్రచారం అయి సామాన్యభాషగా నేర్చుకొనే వరకూ విద్యావంతులలో ఇంగ్లీషు సామాన్య భాషగా వుంటుంది."

## ఇదో చిక్కు సమస్య

పైనచెప్పిన దానినిబట్టి ఒకటి అర్థం అవుతుంది. అస్సాంలో ఈమధ్య జరిగిన ఘటనలు తెచ్చిపెడుతున్న సమస్యలు చాలా చిక్కులతో కూడుకొన్నవి. వానికిమూలం చరిత్రలోనూ, సామాజిక వ్యవస్థలోనూ వుంది. మరొకటి కూడా స్పష్టం అవుతూంది. అస్సామీయులకూ— బెంగాలీలకు మధ్యనన్న తగాదాలే దానికి కారణం కాదు. మతాచారాలకు ఇందులో ప్రముఖస్థానం వుంది.

అస్సామీయులూ, బెంగాలీలూ, మార్వారీలూ చిరకాలం కొండ జాతుల్ని పీడించుకుతిన్నారు. వారిపుడు కట్టెలుకొట్టుకొనీ, నీళ్ళు మోసుకొనీ బ్రతకడంతో సంతృప్తి పడరు. వారు చదువుకొంటున్నారు. వెన్నువిరిచి తలఎత్తుకు నిలబడుతున్నారు. స్వతంత్ర భారత పౌరులుగా వారు తమకు చెందవలసిన హక్కులను కోరుతున్నారు. వానిని తమకు కలిగించాలనీ, తాము సర్వతోముఖంగా అభివృద్ధి పొందేటందుకు అవకాశాలు కలిగించాలనీ వారు కోరుతున్నారు. అస్సాంకొండప్రజలలో వ్యాపిస్తున్న ఈ ఆందోళనకు వెనక సామ్రాజ్యవాదులతో సంబంధాలున్న క్రిస్టియను మత ప్రచారకు లున్నారని కొందరు అంటున్నారు. దానిలో కొంత నిజమూ వుండొచ్చు. కొండజాతి ప్రజలలో చాలభాగం క్రైస్తవులు. మత ప్రచారకులకు వారిలో చాల పలుకుబడే వుంది. అయితే ఎవరో కొందరు నాయకులు ఈ ఆందోళన కంతకూ మూలం అనుకోవడం కేవలం గుడ్డితనం తప్ప వేరు కాదు. వారి కోరికలలో కొన్ని ఎల్లాంటివి అనే దానికన్న కొండతెగల ప్రజలకు నిజమైన అసంతృప్తి కారణాలే వున్నాయనీ, దానికి ఫలితంగా అస్సాం ప్రభుత్వంయెడ వారికి అయిష్టం ఏర్పడిందనీ, చివరకు విడిపోవాలనే కోరిక బలపడిందనీ చెప్పడానికి సందేహం అవసరంలేదు. క్రిస్టియ నేతరులైన కొండజాతులవారు కూడా వేరుపడాలనే కోరుతున్నారు.

కొండతెగల నాయకులు మూడో ప్రభుత్వభాషగా బెంగాలీ వుండాలనడంలేదు. వారు ప్రభుత్వభాషగా

అస్సామీ - బెంగాలీ భాషలు రెండూ వుండకూడ దంటున్నారు. ఒక్క ఇంగ్లీషే ప్రభుత్వభాషగా వుండాలనీ, తర్వాత దాని స్థానంలో హిందీ రావాలనీ వా రంటున్నారు. కాచారులో బయలుదేరిన భాషావుద్యమం అస్సాం ప్రభుత్వ భాషా చట్టానికి వ్యతిరేకంగా సాగుతూంది గనక దానియెడ సానుభూతి తెలుపుతున్నారు. ఆ వుద్యమాన్ని అణచివెయ్యడానికై అస్సాం ప్రభుత్వం అవలంబించిన చర్యలు వారి కిష్టంకాలేదు. సిల్చార్‌లో జరిగిన కాల్పులకు నిరసనగా కొండప్రాంతాలలోవున్న షిల్లాంగులో మే 27 న పూర్తి హర్తాళ్ జరిగింది. ఆనాడు జరిగిన ప్రదర్శనను కొండజాతుల నాయకులూ, బెంగాలీ నాయకులూ కలిసి ఏర్పాటుచేశారు. అంత పెద్ద ప్రదర్శన షిల్లాంగులో ఎన్నడూ జరగలేదు.

మే 19 న కాచార్ అంతటా ప్రదర్శనలూ, హర్తాళులూ జరిగాయి. కాల్పుల రోజున చనిపోయిన పదకొండుగురికీ ఆ రోజున పెద్దదినం. సంగ్రామ పరిషత్తు సత్యాగ్రహాన్ని నిలుపుచేసింది. కాని, అంతకన్న "పెద్దదీ, విస్తృతమైనదీ వుద్యమాన్ని" ప్రారంభిస్తామని ప్రకటించింది.

## అస్సామీయులలో అసంతృప్తి

కాచార్‌లో పెద్ద వుద్యమం ప్రారంభం కాబోతూంది. రెండో వేపునకొండజాతి ప్రజలుపోరాటాలకు సన్నద్ధం అవుతున్నారు. వీనికితోడు బ్రహ్మపుత్రానదీలోయలో అత్యధిక సంఖ్యాకులుగా వుంటున్న అస్సామీ ప్రజలలో అసంతృప్తి వ్యాపించింది. దేశంలో తమదొక్కటే ద్విభాషా రాష్ట్రం ఎందుకుకావాలి? తమ భాషనే ఎక్కువమందిప్రజలు మాట్లాడుతున్నా, అది అధికార భాష ఎందుకు కాకూడదు? అని వారి ప్రశ్న. చిరకాలం బెంగాలీలు ప్రభుత్వంలోనూ, వుద్యోగాలలోనూ ప్రధానస్థానాల నాక్రమించిపెత్తనంచేశారనేది వారు మరచిపోలేదు. ఈవేళ తమ రాష్ట్రంలో తమకున్న హక్కుల్ని అనుభవించనీకుండా సంగ్రామ పరిషత్తు ఆటంక పరుస్తూందని వారి కోపం. పశ్చిమ బెంగాలులోని వార్తా పత్రికలలో అధిక భాగం సాగించిన తీవ్ర అస్సామీ వ్యతిరేకాందోళనతో ఈ అసంతృప్తి మరీ పెరిగింది బెంగాలీ వ్యతిరేక జాతి దురహంకారం విషయంలో అస్సామీ పత్రికలు లోటు ఏమీచెయ్యలేదు. ఈ స్థితిలో కాచార్ జిల్లా, కొండతెగల ప్రాంతాలూపోతే పోయాయి—అధికార భాషాచట్టంలో పెద్ద మార్పులేమీ అంగీకరించకూడదనేది నేడు అస్సాం లోయలో ప్రచలితంగావున్న అభిప్రాయం. అది బలపడుతూవుంది.

ఈ పరిస్థితులలో నిఖిల అస్సాం వంగ భాషాభాషీసమితి ఒక ప్రకటన చేసింది. బెంగాలీని మూడో ప్రభుత్వ భాషగా చెయ్యాలనే కోరికను బలపరుస్తూ జూన్ 4 నుంచి ప్రత్యక్ష పోరాటం ప్రారంభిస్తానంది. దానితో ఆవేశాలు పెరిగాయి. ఆ విధంగా

ప్రత్యక్ష పోరాటమే ప్రారంభమైతే ఎటువంటి ఘటనలు జరుగుతాయో ననే భయం ఏర్పడింది. గత సంవత్సరపు ఘటనల నింకా ఎవ్వరూ మరిచిపోలేదు.

అస్సాంలో పరిస్థితులు సంక్షోభానికి దారితీస్తున్నాయనే విషయాన్ని ఇంత వరకూ వచ్చాక దుర్గాపూర్‌లో కాంగ్రెస్ నాయకులు గ్రహించారు. భాషా సమస్యకు పరిష్కారమార్గం చూడడానికై శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి అస్సాం వస్తున్నారని మే 29 న ప్రకటన వెలువడింది. ఆయన కోరిక మీద నిఖిల వంగ భాషాభాషీసమితి ప్రత్యక్ష పోరాటాన్ని వాయిదా వేసింది.

శ్రీ శాస్త్రి బెంగాలీ, అస్సామీ నాయకులతో చర్చలు జరిపి జూన్ 6 వ తేదీన కొన్ని ప్రతిపాదనలను చేశారు. * అసహ్యాకరమైన మహ

---

* శాస్త్రి చేసిన ప్రతిపాదనల సారాంశం ఇది :

1. మహకుమా పరిషదులకు సంబంధించిన మినహాయింపు భాగాన్ని తొలగిస్తూ అస్సాం ప్రభుత్వ భాషా చట్టాన్ని సవరించాలి. [కాచార్‌లో వ్యవహార నిర్వహణకై బెంగాలీ బదులు అస్సామీ నుపయోగించేటందుకు మార్పు తెచ్చే అవకాశం చట్టం ప్రకారం మహకుమా పరిషదులకు ఇవ్వబడింది.]

2. రాష్ట్ర ప్రభుత్వానికి కాచార్ జిల్లాతోనూ, అటానమస్ పర్వతప్రాంత జిల్లాలతోనూ నడిచే వ్యవహారాలలో ఇంగ్లీషు నుపయోగించాలి, తర్వాత హిందీ దానిస్థానం తీసుకొంటుంది.

3. రాష్ట్ర స్థాయిలో ప్రస్తుతానికి ఇంగ్లీషు వ్యవహార భాషగా వుంటుంది. తర్వాతకూడా అస్సాము భాషతోపాటు ఇంగ్లీషూ వ్యవహారంలో వుంటుంది.

4. 1956 సెప్టెంబరు 19 న భారత ప్రభుత్వం ప్రకటించిన మెమొరాండములో చెప్పిన రక్షణలన్నీ రాష్ట్రంలోని భాషాల్పసంఖ్యాకులకు లభింపచేయబడతాయి.

5. ప్రభుత్వ భాషాచట్టం మూడో సెక్షన్ రెండోనిబంధన ప్రకారం చట్టాలు బిల్లులు, ఆర్డినెన్సులు, నిబంధనలు, ఆర్డర్లు మొదలయినవి అస్సామీభాషలో ప్రచురించినా రాజ్యాంగ చట్టం 348 (3) ఆర్టికలు ప్రకారం ప్రభుత్వ గజెట్‌లో ఇంగ్లీషులోనే ప్రకటించబడతాయనే వివరణ ప్రకటిస్తారు

6. అభివృద్ధి పథకాలను బాగా అమలు జరపగలిగేటందుకై జిల్లా స్థాయిలో కొన్ని ఏర్పాట్లు చేయబడతాయి.

7. కాచార్‌లోని ఆందోళనను మానుకోవాలి.

8. ఉద్యమం తిరిగి ప్రారంభం కాదని తోచగానే ప్రభుత్వం విధ్వంసక, హింసాచర్యలు చేసిన వారిని మినహా ఈ వుద్యమంలో అరెస్టుచేసిన వారందరినీ విడిచిపెట్టేటందుకు ఆలోచిస్తుంది.

కుమాపరిష దధికారాల క్లాజును తొల గిస్తారు. అదొక విజయమే. అయితే ఈ ప్రతిపాదన కాచార్ సంగ్రామ పరిషన్నాయకులకు సంతృప్తి కలిగించ లేదు. జూన్ 9 న వారొక తీర్మానం చేశారు. "శ్రీ శాస్త్రి తీర్మానం అసలు సమస్యను (బెంగాలీ మూడో ప్రభుత్వ భాష కావాలనేది) దాటేస్తూంది. కాన ఏమాత్రం అంగీకారయోగ్యం కాదు." (ప్రెస్ ట్రస్టు ఆఫ్ ఇండియా)

## హైలాకండీ కొట్లాటలు

సత్యాగ్రహం వెంటనే ప్రారంభిస్తా రనే (పరిషన్నాయకులు ఆ మాట స్పష్టంగానే చెప్పారు) అర్థం లేక పోయినా, ఆ ప్రకటన అర్థం ఆవే శాలూ, ప్రతిష్టంభనా ఏ మాత్రం తగ్గలేదనే. ఆ ప్రకటన ఎంతో ప్రమాద భరితం. బెంగాలీలకూ – అస్సామీలకే కాదు, కాచార్ప్రజలలోనే అది విద్వే షాలను పురికొల్పుతుంది. బెంగాలీని మూడో ప్రభుత్వభాషగా చెయ్యాలనే కోరికమీద పట్టుబడితే కాచార్ను అస్సాంనుంచి విడదీసే పరిస్థితి ఏర్పడుతుందనే భయం ముస్లిముల లోనూ, మణిపురీలలోనూ ప్రబలంగా వుంది.

కాచార్ జిల్లా హైలాకండీలో జూన్ 19 న తీవ్రమైన కల్లోలాలు జరిగాయి. "అస్సామీ భాషను సమ ర్థిస్తూ ప్రదర్శనచేయడానికై పదివేల మంది పట్టణంలోకి చొచ్చుకు వచ్చార"ని చెప్పారు. దోపిడీ, గృహ దహనాలూ సాగాయి. పోలీసులు కాల్పులు కాల్చారు. ఎనమండుగురు మగణించారు. ఆ ఘర్షణలు మతప్రాతి పదికపైననే సాగేయి. ప్రభుత్వం లోనూ, పరిపాలనా శాఖలలోనూ వున్నతోద్యోగుల గూడుపుఠానీ లేక పోతే ఈ ఘట్టాలు జరిగేవి కావు. కాచార్లో ఇతరచోట్లకూడా సంఘ ర్షణలు జరిగాయి. కాచార్లో ఎక్కువ మంది అస్సాంనుంచి విడిపోవడానికి అంగీకరించక పోవడాన్ని ఎంతో తెలివిగా, జౌగాముల్ని ఆలోచించ కుండా వుపయోగించుకొని మత ద్వేషాల్ని రెచ్చగొట్టారు.

తర్వాత ఢిల్లీలో శ్రీ శాస్త్రికీ, సంగ్రామ పరిషత్ నాయకులకూ సంప్రతింపులు జరిగాయి. ఒప్పందం ఏమీ కుదరలేదు కాని, పరిషన్నాయ కులు సత్యాగ్రహం ప్రారంభించ బోమనీ, శాస్త్రి పరిష్కారాన్ని ఓ మారు కార్యరూపంలో పెట్టిచూద్దా మనీ నిర్ణయించుకొన్నారు. ఆ విధంగా ఒక ప్రకటన చేశారుకూడా. ఇది శుభోదర్కమే. కాని ప్రతిష్టంభన తీరలేదు. రెండో వేపున అక్టోబరు 24 వ తేదీన కొండరాజ్యాల యూని యన్ను ఏర్పరచవలసిందని కోరుతూ ప్రత్యక్ష చర్యలకు పూనుకొంటామని

---

ఈ పరిష్కారం 'సుస్థిరం'గా వుండగలదనీ, అస్సాం ముఖ్యమంత్రి బి. పి. చాలిహా దీనికి సంబంధించిన వివరాలను గూర్చి సాధికార ప్రకటన చేస్తారనీ శ్రీ శాస్త్రి అన్నారు.

అఖిల పక్ష కొండజాతి నాయకుల సమావేశం తీర్మానించినట్లు వార్తలు అదే కాలంలో వచ్చాయి.

అందుచేత పరిస్థితి తీవ్రంగానే వుంది.

అస్సాములో తీవ్ర పరిస్థితులేర్పడి, ప్రజలలోని వివిధ విభాగాలమధ్య తీవ్ర విద్వేషాలు ఏర్పడి అప్పుడే ఏడాది దాటింది. ఫలితంగా శ్రామిక వర్గం, రైతాంగం, శ్రమజీవులు, మేధావులు, విద్యార్థుల మధ్య ఐక్యత విచ్ఛిన్నం అవుతూంది. ఇది యావత్తు ప్రజాతంత్రోద్యమానికీ పెద్ద నష్టం. అస్సామీలలోనూ, బెంగాలీలలోనూ కూడ జాతిద్వేషాన్నీ జాతి దురహంకారాన్నీ ప్రేరేపిస్తున్న ఉగ్రశక్తులు ముందుకు వస్తున్నాయి. ఇదే కనక కొనసాగితే, వచ్చే ఎన్నికలలో రాజకీయార్థిక సమస్యలు వెనకబడి కక్షలూ—కావేషాలూ బ్రహ్మాండంగా వృద్ధి పొందుతాయి.

ప్రస్తుత దుస్థితికి అస్సాంలోనూ కేంద్రంలోనూ వున్న ప్రభుత్వాలూ, కాంగ్రెసూకూడ కారణాలని చెప్పవచ్చు. సంకుచితములైన కాంగ్రెసు ప్రయోజనాలనే మనస్సులో పెట్టుకొని వారు సమస్యను తెలివిగానూ, ధైర్యంగానూ పరిష్కరించలేక పోయారు. వారికో దృఢమైన కార్యవిధానం లేదు. నెహ్రూ, తదితర అఖిల భారత కాంగ్రెసు నాయకులూ రాష్ట్రంలో కల్లోలాలు జరిగిన వెంటనే భాషా చట్టం విషయంలో తొందర పడ కూడదని అభిప్రాయ పడ్డారు. అయితే, తమరు ఇస్తున్నది 'సలహా' మాత్రమే అంటారు గాని, గట్టిగా వద్దని చెప్పరు. మహకుమా పరిషత్తులకు సంబంధించిన క్లాజుచేర్చడం తప్పు అనీ, చాలా చిక్కులకు దారి తీస్తుందనీ వారెరుగుదురు. కాని, అస్సాం కాంగ్రెసు నాయకుల్ని పిలిపించి దానిని తీసివేయించ లేరు.

అస్సాములో ప్రజాసోషలిస్టుపార్టీ విధ్వంసకర, జాతిదురహంకారపూరితమైన విధానాన్ని అనుసరించింది.

ఇప్పుడు భవితవ్యం ఏమిటి? ఇప్పుడు మళ్ళీ అస్సాములో గందరగోళాలు వస్తే, ఆరాష్ట్రంలో మాత్రమే తీవ్రపరిస్థితి ఏర్పడి వూరుకోదు. పక్కనున్న పశ్చిమబెంగాలులోనూ, ఇంకా ఇతర రాష్ట్రాలనూ దాని దుష్ఫలితాలు కనిపించకమానవు. అందుచేత అతివేగంగా రాష్ట్రప్రజలలో మైత్రీసంబంధాలను పునస్సంస్థాపించేటందుకు గట్టిచర్యలు తీసుకోవలసిన అవసరంవుంది.

అదెల్లాగ చెయ్యడం?

అస్సామునుంచి కాచార్‌ను విడ తీయడంతో సమస్య పరిష్కారంకాదు. కాచార్‌లోకూడ చాలమంది దానికి విముఖులు. చాలమంది దానిని వ్యతిరేకిస్తున్నారు.

అస్సామును ద్విభాషారాష్ట్రం చెయ్యడంతోకూడ యీ సమస్య పరిష్కారంకాదు. రాష్ట్రజనాభాలో 55 శాతం అస్సామీయులేనన్నది (1951 జనాభాలెక్కల ప్రకారం) నిజం. [ఏరాష్ట్రమునైనా ఏకభాషారాష్ట్రంగా చెయ్యాలంటే, ఆ భాష మాట్లాడే

వారా రాష్ట్రంలో 70 శాతం వుండాలని రాష్ట్ర పునర్నిర్మాణ సంఘం నివేదిక సూచిస్తూంది ] బెంగాలీ మాట్లాడే వారి సంఖ్య 20 శాతం వుంది. అందు చేత రాష్ట్రంలో అస్సామీలకూ బెంగాలీలకూ సమాన హోదా వుండాలని కోరడం బెంగాలీలకు తగదు. ఒకవేళ అస్సాం ప్రభుత్వం ఒప్పుకొన్నా, అస్సామీ ప్రజ వొప్పుకోరు. గట్టిగా వ్యతిరేకిస్తారు. తమ భాష ప్రభుత్వ భాష కావాలనే వాంఛ వారిలో దృఢంగావుంది. బెంగాలీకి అస్సామీ భాషతో సమాన స్థాయిని అంగీకరించ డానికి బదులు కాచార్ విడిపోవ డానికే వారు అంగీకరిస్తారు.

రెండో వేపున అస్సాంలోని వివిధ భాషలలో బెంగాలీ చాల ప్రాముఖ్యం గల భాషలలో ఒకటి. కాచార్‌లో వున్న ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు మాటాడుతారనేది ఒక్కటేకాదు. బ్రహ్మపుత్రా లోయలో బెంగాలీ జనాభా ఎక్కువగానేవుంది. ప్రధాన అల్పసంఖ్యాకులుగా బెంగాలీలకు కొన్ని ముఖ్యమైన హక్కులున్నాయి. హక్కులతో పాటు బాధ్యతలూ వున్నాయి. వారు నిజ పరిస్థితులను గమనించాలి. అసాధ్యములయిన వాంఛలు కోరకూడదు. అస్సాములో అస్సామీభాషే ప్రభుత్వ భాషగా వుండాలి. ఎక్కువజనాభాగల జాతిగా అస్సామీయులు హృదయ వైశాల్యం చూపాలి. బెంగాలీల, కొండజాతి ప్రజల విశ్వాసాన్ని చూరగొనాలి.

## కమ్యూనిస్టుపార్టీ ప్రతిపాదనలు

ఈ విషయాలన్నీ దృష్టిలో పెట్టుకొని, రాష్ట్ర ఐక్యతకోసం, అస్సాంలోని ప్రజలలో స్నేహ సంబంధాలు తప్పనిసరిగాఏర్పరచడంకోసం కమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి ఒకతీర్మానం చేసింది. అది న్యాయమూ, అనుసరణీయమూనని మా అభిప్రాయం. దాని ప్రకారం :

'బహుభాషాప్రజలున్న అస్సాం రాష్ట్రంలో అస్సామీయేప్రభుత్వ భాషగా వుండాలని జాతీయ సమితి తిరిగి ఉద్ఘాటిస్తూంది. కాచార్ జిల్లాలో అధికారభాషగా బెంగాలీని గుర్తించాలి. దానికి మినహాయింపులేవీ వుండకూడదు. ఈ సందర్భంలో కాచార్ జిల్లాలో బెంగాలీ భాష లేకుండా చేయ డానికై మహకుమా పరిషత్తులకూ మునిసిపల్ బోర్డులకూ అధికారం ఇస్తున్న 1960 సంవత్సరపు అస్సాం ప్రభుత్వ భాషాచట్టం 5వ సెక్షనులోని అవకాశాలను జాతీయ సమితి ఖండిస్తూంది. ప్రజాతంత్ర విరుద్ధమైన ఈ క్లాజును తొలగించాలని సమితి డిమాండు చేస్తూంది, అస్సాంలోని మా పార్టీ శాఖ గట్టిగా దానినే కోరుతూవుంది.

గెజట్లు, బిల్లులు, చట్టాలు మొదలయినవి బెంగాలీలోకూడ ప్రచురించాలి. బెంగాలీ నేర్పాలి. రాష్ట్ర ప్రభుత్వానికీ, కాచార్

జిల్లాకూ మధ్య నడిచే వ్యవహారాలలో ఇంగ్లీషుతోపాటు బెంగాలీని కూడ అనుమతించాలి. ఈ విధంగా కొన్ని నిర్దిష్టమైన వ్యవహారాలకు అస్సాంరాష్ట్రం అంతటా బెంగాలీని గుర్తించాలి. అయితే బెంగాలీని మూడో ప్రభుత్వ భాషగా గుర్తించాలనడాన్ని కమ్యూనిస్టు పార్టీ సమర్థించదు. త్వరలోనే పరస్పర చర్చలూ, సంప్రతింపుల ద్వారా బెంగాలీని పై విధంగా గుర్తిస్తారని సమితి విశ్వసిస్తూంది. 1956 నాటి భారత ప్రభుత్వపు మెమొరాండములో యిటువంటి వానికి సంబంధించిన ప్రతిపాదనలనూ, విధాన సూత్రాలనూ విస్పష్టంచేసి, అమలుజరపాలనీ, దానికి అవసరమైన కార్యక్రమాన్ని ఏర్పరచాలనీ, సమితి ప్రభుత్వాన్ని కోరుతూంది.

తమ తమ భాషల విషయమై కొండజాతి ప్రజలకు గల హక్కులను గుర్తించాలి. కొండప్రాంతపు జిల్లాలలో అధికారభాషగా వారి భాషనే గుర్తించాలన్న ప్రభుత్వ నిర్ణయాన్ని వెంటనే అమలు జరపాలి.

కచార్‌లోను, కొండ ప్రాంతపు జిల్లాలలోను, అస్సాములోని ఇతర ప్రాంతాలలోనుకూడ అనేక అల్ప సంఖ్యాక ప్రజా సమూహాలున్నాయి. వారి హక్కులకు రక్షణనివ్వాలి.*

1956 నాటి భారత ప్రభుత్వపు మెమొరాండంలో మంచి ప్రతిపాదనలే వున్నాయి. అల్పసంఖ్యాకుల హక్కుల రక్షణకు సూచనలున్నాయి. వాటిని అమలు జరపాలి. దానికోసం అన్ని రాష్ట్రాలలోనూ అవసరమైన చర్యలు తీసుకోవాలి.

రాజ్యాంగచట్టం ఆరవ షెడ్యూలు మేరకు కొండప్రాంతాలకువున్న పరిమిత స్వాతంత్ర్య హక్కులను రాజ్యాంగ చట్టానికి సవరణతెచ్చి విస్తరింపచెయ్యాలని కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయం. ఆ విధంగా చేసినప్పుడు కొండ ప్రజల న్యాయమైన కోరికలను నెరవేర్చవచ్చు. వారి న్యాయమైన అసంతృప్తులను సరిదిద్దవచ్చు. అస్సామును ముక్కలుచేయనక్కర్లేదు. అయితే ఈ పరిష్కారానికి అంగీకరిస్తారా, మరో పరిష్కార మార్గాన్ని సంప్రతింపులద్వారా రూపొందిస్తారా యన్నది కొండజాతి ప్రజలూ, వారి నాయకులూ తేల్చుకోవలసిన విషయం. కేంద్ర ప్రభుత్వమూ వారూ ఒక అంగీకారానికి రాలేకపోతే చాల గట్టిగా ఆలోచించవలందే. ఇది బలంతో తేల్చవలసిన విషయంకాదు, రాజకీయ పునాదిపై దానిని పరిష్కరించ వలసిందేకాని.

ఈ నాడు అస్సాము నెదుర్కొంటున్న సమస్యలకు సుస్థిర పరిష్కార మార్గం లభిస్తుందని కమ్యూనిస్టుపార్టీ ఆసిస్తూంది. అస్సాం విచ్ఛిన్నంకాకుండానే, అక్కడ నివసించే ప్రజల

(మిగతా 16 వ పేజీలో)

# భారతీయ వ్యవసాయంమీద పన్నుల భారం

అశోక మిత్ర

1. ఇప్పటికి రెండు పంచవర్ష ప్రణాళికలు పూర్తి అయాయి. ఇప్పటికీ భారతీయ వ్యవసాయం యొక్క స్థితి అస్థిరంగానే వుంది. ఈ మధ్య జరిగిన అనేక చర్చలలో దీనిని గురించి బహుముఖ వ్యాఖ్యానాలు వచ్చాయి. మొదటి పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయోత్పత్తి అభివృద్ధి చెందిందనే మాటనిప్పుడు గట్టిగా అనడంలేదు. 1959-60 లో పంట తగ్గడంతో 1958-59 నాడు బాగా పండినా దానివలన పెద్ద వుత్సాహం కనబడ్డంలేదు. 1950-51 నుంచి నేటివరకూ వ్యవసాయోత్పత్తి క్రమం:గా పెరుగుదలను చూపుతున్నా, వాతావరణ పరిస్థితుల అనుకూల్యమే దానికి ప్రధాన కారణంగా వుంటూంది. భారతీయ వ్యవసాయాభివృద్ధిలో యాదృచ్ఛికమైన వానినీ, పెట్టుబడులు హెచ్చించీ, నిర్మాణం బాగుపరచీ చేయడంవలన కలిగిన వృద్ధినీ విడబరచ చూపడానికి కొంతసాహసమే కావాలి. 1950-51 నుంచి నేటి వరకూ ఏటా 2 5 శాతం పెరుగుదల వుందనడం 'సరియైన' అంచనాగా భావిస్తున్నారు. రెండో వేపున దేశంలో జనాభా ఏటా 2 శాతం

---

(15 వ పేజీ తరువాయి)

న్యాయమైన కోరికలను తీర్చగల పరిష్కారమార్గం లభించితీరుతుంది. దీనికి ఓర్పు, సద్భావమూకావాలి. ఒకరినొకరు . అర్థంచెసుకొనేటందుకు గట్టిగా ప్రయత్నించాలి. ఒప్పందంకుదుర్చుకొనేకుందుకు సర్వాత్మనా ప్రయత్నించాలి. ప్రస్తుత పరిస్థితి కొనసాగడం చాల ప్రమాదభూయిష్టం. భారతీయైక్యతకు శత్రువులైనవారికే అది సంతోషదాయకం.

అస్సాంనుంచి యావద్భారతమూ గుణపాఠాలు నేర్చుకోవలసివుంది. భాషాల్పసంఖ్యాకులసమస్యలు, కొండజాతిప్రజల సమస్యలు – అస్సాములో తీవ్రరూపంలోవున్నా – మిగిలిన రాష్ట్రాలలోకూడా వున్నాయి. దేశ ఐక్యతను కాపాడాలన్నా, ప్రజాతంత్రోద్యమం విచ్ఛిన్నం కాకుండా వుండాలన్నా ఈ సమస్యలను పరిష్కరించాలి. దేశభక్తియుతములైన పార్టీలూ, ప్రజలూ దీని విషయంలో శ్రద్ధాశక్తులు చూపించాలి.

[న్యూఏజ్ జూలై - ఆగస్టు 1961]

పెరుగుతూనే వుందిగనక, భారతీయ వ్యవసాయం హీనాహీనీగా సరిపడే టంత వుత్పత్తిచేసే స్థితినుంచి బయట పడిందనడానికి వీలులేదు.

2 వ్యవసాయంలో వున్న లోపం ఏమిటనే చర్చ ఈ మధ్య తీవ్రంగా సాగుతూంది. మూడవ ప్రణాళికను రూపొందించేటందుకు సాగుతున్న చర్చలలో అధికభాగం భారతదేశపు వ్యవసాయోత్పత్తిని మార్చి వేసేటందుకు మార్గాంతగాలను అన్వేషించడం లోనే కేంద్రీకరించాయి. వ్యవసాయం వెనకబడివుండడానికి కారణాలను వివేచనచేసే సందర్భంలో, వ్యవసాయంమీద ప్రభుత్వరంగంలో కేటాయిస్తున్న మొత్తాల్ని గురించీ, పంచవర్ష ప్రణాళికలలో, ముఖ్యంగా రెండో పంచవర్షప్రణాళికలో ద్వితీయ ప్రాముఖ్యంగల విషయాలకు కేటాయించిన మొత్తాల్ని గురించీ వ్యతిరేక వ్యాఖ్యానాలు కూడా వచ్చాయి. మొదటి ప్రణాళికలో వ్యవసాయానికి 30 శాతం మొత్తం కేటాయించి, రెండో ప్రణాళికలో 18 శాతాన్నే కేటాయించినందుకు వ్యతిరేకత తెలిపారు. దేశంలోని ఉత్పత్తిలో ఇంచుమించు సగం భాగం వ్యవసాయం నుంచేలభిస్తూందనిగాని, వ్యవసాయం వృద్ధిపొందనిదే పరిశ్రమలు వృద్ధి కావనే సత్యాన్నిగాని గ్రహిస్తే, ఇల్లా జరిగి వుండేదికాదని వారి విమర్శ. పారిశ్రామిక రంగంలో కావలసిన జనాన్ని వ్యవసాయ రంగం ఇవ్వాలి. వారికిచ్చే జీతాలతో కొనుక్కోగల సరుకుల్ని వ్యవసాయం ఉత్పత్తి చెయ్యాలి. పరిశ్రమలు తయారు చేసే వస్తువులకు కావలసిన ముడిసరుకుల్ని వ్యవసాయం తయారు చెయ్యాలి. ఆ వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేయడం చేత రెండో ప్రణాళికలో పెట్టుబడుల కేటాయింపు అభివృద్ధి పథకాన్ని మూలంలోనే తెంచేసింది.

3. రెండో ప్రణాళికా కాలంలో వ్యవసాయంలో ఎంత పెట్టుబడికావాలనే విషయమై భేదాభిప్రాయాలు కూడా వచ్చాయి. వ్యక్తులు ఆరంగంలోపెట్టేది 200కోట్లనుమించుతుందని ఎప్పుడూ భావించడంలేదు. అందుచేత ప్రభుత్వం ప్రభుత్వరంగంలో 820 కోట్లు పెట్టుబడి పెట్టాలనుకున్నాదాంట్లో నాలుగోవంతు మదుపునకుగాక ఇతర పనులకోసమే ఖర్చు పెట్టాలనుకుంటున్నారు గనక వ్యవసాయ రంగంలోకి వచ్చేపెట్టుబడి మొత్తం 800 కోట్లే వుంటుంది. ప్రణాళికాకాలంలో వ్యవసాయం 18 శాతంపెరుగుతుందని అంచనా. అంటే ఆ అయిదేళ్ళలోనూ పెట్టిన పెట్టుబడికూడా పూర్తిగారాదు. (ఏమంటే మొదటి ప్రణాళిక ఆఖరు సంవత్సరం 1955–56 లో వ్యవసాయోత్పత్తి 4390 కోట్ల రూపాయలు. రెండో ప్రణాళికా కాలంలో పెరిగేది 18 శాతం అంటే 790 కోట్ల 20 లక్షలు మాత్రమే). ప్రణాళికలో దీర్ఘకాలానికిగాని పూర్తిగాని నీటిపారుదల పథకాల నిర్మాణాలు చాలా వున్నాయి. దాని మూలంగా ఆ మాత్రం అద

నపు వుత్పత్తికూడ వుండకపోవచ్చు. వుండదు. పెట్టుబడులకు డబ్బులేక పోవడంచేత పిల్లకాలవలూ, బోదెలూ మొదలైనవి తవ్వడం నెమ్మదిగా జరుగుతుంది. విత్తనాలు, ఎరువులు మొదలైన వాటికి తగినంత డబ్బు లేదు. కొసరి కొసరి ఖర్చుచేసే పద్ధతి ననుసరిస్తుండడంవలన వ్యవసాయోత్పత్తిలో విప్లవ ఫలితాలు రాకుండా ప్రభుత్వమే ఆటంక పరుస్తోంది.

4. దేశంలోకల్లా పెద్ద పరిశ్రమ దారు ప్రభుత్వం. ఆ ప్రభుత్వమే పెట్టుబడుల నధికంగా వ్యవసాయం వేపు మళ్ళించడం మంచిదనీ, ఇక్కడ వేర్వేరు వ్యక్తు లెవ్వరూ అభివృద్ధికి కావలసిన అవసరాల్ని నిర్మించలేరనీ కొందరు అభిప్రాయ పడుతున్నారు. భారతీయ పరిశ్రమలకూ, వ్యవసాయానికీ పరిస్థితులలోనే చాలా భిన్నత్వం వుంది. భారతీయ పరిశ్రమలలో వ్యక్తులు బాగా బలపడ్డారు. వేవేగంగా ప్రైవేట్ రంగం విస్తరిస్తోంది. అటువంటి పరిస్థితులలో వ్యవసాయ రంగంలో ప్రభుత్వం గట్టిగా పూనుకోవడం ముఖ్యం. ఒక రంగం వెనకబడి వుండడాన్ని సరిదిద్దుకొనేటందుకై ప్రభుత్వం పెట్టుబడులు అధికంగా సమీకరించేటందుకు తోడ్పడాలి. స్వయంగానైతేనేం, సబ్సిడీలిచ్చి అయితేనేం ఆ పని చెయ్యాలి. ఇంచుమించు వ్యవసాయరంగం అంతా ఏదో విధంగా రోజు వెళ్ళదీసే స్థితిలో వుండడంచేత వ్యవసాయాభివృద్ధికోసం ధనం బయటినుంచే తేవాలి. ప్రభుత్వం ఇతర రంగాలనుంచి ధనాన్ని సేకరించి, వ్యవసాయానికి మళ్ళించాలి. అంతే వ్యవసాయం యెడ అభిమానం చూపించడమే కాకుండా పరిశ్రమలు, వాణిజ్య రంగాలనుంచి వ్యవసాయానికి పెట్టుబడులకై నిధులను మళ్ళించేటందుకు ప్రోత్సాహం లభించేటట్లు చేయాలి.

5. ఆర్థికాభివృద్ధికోసం అదనపు ధనాన్ని ఎల్లా సంపాదించాలనే విషయంమీద అనేక అభిప్రాయ భేదాలున్నా, పైనచెప్పిన అభిప్రాయాన్ని చాలమంది బలపరుస్తున్నారు ధనం బాగావున్న వ్యవసాయేతర రంగాల నుంచి తీసుకొచ్చి వెనకబడివున్న వ్యవసాయాన్ని అభివృద్ధి పరచాలనేవిజ్ఞప్తి చేయడంలో అనేక నిగూఢాభిప్రాయా లుండవచ్చు. వ్యవసాయం సమానతను కల్పిస్తుందనీ, దానిని అభివద్ధి పరచేటందుకు పరిశ్రమల నుంచీ, వాణిజ్యంనుంచీ డబ్బు తీయడం మంచిదనీ బావించేవారు కొందరున్నారు. పరిశ్రమలను వారు అసహ్యించుకొంటారు.

6. వ్యవసాయానికి సహాయ పడేటందుకై ఇతర రంగాలకు పన్ను వెయ్యాలనే వారు వ్యవసాయంలో కన్న ఇతర రంగాలలో తలసరి సగటు ఆదాయం రెండున్నర రెట్లు వున్నదని వాదిస్తుంటారు. ఇంత తేడా వున్నప్పుడు అభివృద్ధికి కావలసిన ధనాన్ని బాగా పురోభివృద్ధి పొందిన రంగాల నుంచే అధికంగా తియ్యాలనడం న్యాయం. కాని ప్రస్తుతంవున్న పన్నుల

విధానంలో ఎక్కువపన్నుల నిస్తున్న దెవరనే మాటను వీరు తీసుకురారు. అదే తీసుకువస్తే వ్యవసాయరంగమే మంచి సౌకర్యాలను కలిగివున్న దని పిస్తుంది. అతివేగంగా అభివృద్ధిపొందు తున్న ఆర్థికవ్యవస్థలో రవాణా, వ్యాపార, పారిశ్రామికరంగాలు ఇతర రంగాలకు ధనం ఇచ్చేస్థితిలోవుండవు. సాధారణంగా లోటుగా కనిపించే విదేశీ ద్రవ్యం ఆ రంగాలలోని సాంకేతికావసరాలను చూపించవు. అసలు ద్రవ్యలోపాన్నే అవి చూపిస్తున్నాయి. ఈ దశలో ఆ రంగాలమీద పన్నులు వేసినా వానిలోని వివిధశాఖల అభివృద్ధికోసం వెయ్యాలిగాని, ఇతర రంగాలకే తీసుకుపోతే అవి నష్టపడతాయి.

7. అయితే వ్యవసాయం మీద వెయ్యగల పన్ను గరిష్ఠపరిమితుల నందుకొన్నదనీ, ఇంకా అక్కడ వసులు బాటు సాధ్యంకాదనీ చెప్పగలమా? తలసరి ఆదాయాన్నిపట్టి వ్యవసాయ రంగంలోని వివిధ తరగతుల జనం ఇవ్వగల, ఇవ్వలేని పన్నుల పరిమితిని నిర్ణయించడం సాధ్యమా? 'వ్యవసాయాన్ని నష్టపరచి' – అనే మాట అనకపోయినా వ్యవసాయంలోకి కన్న ఎక్కువగా పరిశ్రమలకు, రవాణా రహదారులకు వ్యాపారానికి లాభాలు కలిగించే విధంగా ప్రభుత్వపు పన్నుల విధానం వుంటూందా?

8. సరియైన సమాచారం లేకుండానే ఈ విషయం గురించీ, ఇతర సమస్యల గురించీ ఎంతో చర్చ జరిగింది. వ్యవసాయంమీదా, ఇతర రంగాలమీదా ఇండియాలో ప్రస్తుతం వున్న పన్నుల పరిమితులను అంచనా కట్టే ఉద్దేశంతో నేనీ వ్యాసం వ్రాస్తున్నా. ప్రభుత్వం ఈ మధ్య కాలంలో వ్యవసాయంనుంచి ఎంత తీసుకొంది. తిరిగి దానిలో ఎంతవ్యయ పరిచింది–అనే విషయాలమీద ఆధారపడి ఈ వ్యాసాన్ని వ్రాస్తున్నాను.

9. ముందు ప్రత్యక్షపు పన్నుల నుంచి ఏం వస్తూందో లెక్క తీసుకొందాం. రాష్ట్రాలరో ప్రభుత్వాలకు వ్యవసాయంమీద పన్నులువేసి వసూలు చేసుకొనే అధికారాన్ని రాజ్యాంగ చట్టం యిస్తూంది. కేంద్రాధికారంలోవున్న రాష్ట్రాలలో మినహా మిగతావానిలో వ్యవసాయపు పన్నుల మీద ఆదాయం రాష్ట్ర ఖజానాకే చేరుతుంది. అదేవిధంగా వ్యవసాయాదాయాలను ఆదాయపు పన్నునుంచి మినహాయిస్తూ, తమతమ ప్రాంతాలలో వ్యవసాయాదాయాల మీద పన్నులువేసే అధికారాన్ని, వ్యవసాయపు భూములమీద ఎస్టేట్ డ్యూటీలను విధించే అధికారాన్ని రాజ్యాంగ చట్టం రాష్ట్రాలకే ఇస్తూంది. వ్యవసాయంమీద వేసే ప్రత్యక్షపు పన్నులన్నీ ఈ పరిధిలోనికే వచ్చేస్తాయి.

10. భారతీయ పన్నుల విధాన విచారణ సంఘం (ఇండియన్ టాక్సేషన్ ఎంక్వయిరీ కమిషన్) తన రిపోర్టులో వివిధ వ్యవస్థలలో భూమి పన్ను విధింపు పద్ధతి ఏయే విధంగా

వుండేదో వివరించింది. వేర్వేరు రాష్ట్రాలు పన్నులను వేర్వేరు పద్ధతులుగా వసూళ్ళు చేస్తున్నాయి. ఆర్థిక ఆదాయాన్ని పట్టి కొన్నిచోట్ల, నికరం వుత్పత్తినిపట్టి, శిస్తునుపట్టి, ఖరీదును పట్టి, మొత్తం వుత్పత్తినిపట్టి, ఇతర అనేక విషయాలనుపట్టి పన్నులు విధిస్తున్నారు. దేశం అంతటా ఏదో ఒక్క పద్ధతిమీదనే పన్ను విధించడం జరగాలని కమీషనుయొక్క సూచన. కాని ఇంతవరకు ఆ ప్రయత్నం జరగలేదు. వ్యవసాయాదాయం మీద పన్ను వేయడం ఇండియాలో కొత్తగా ప్రారంభమయింది. అందులోకూడా మినహాయింపులకు పరిమితులు. పన్ను రేట్లు రాష్ట్రానికి, రాష్ట్రానికీ తేడాగా వున్నాయి. చాలా రాష్ట్రాలలో అసలాపన్ను లేనేలేదని కూడా చెప్పవచ్చు. వ్యవసాయపు భూములమీద విధించిన 'ఎస్టేట్ డ్యూటీ'లనుంచి ఆదాయాలు రావడం 1954–55 ల నుంచే కనబడుతూంది. ఆ వచ్చిందికూడా చాలా స్వల్పం. వివిధ ప్రత్యక్ష పన్నులనుంచి ఏయే సంవత్సరాలలో ఎంతెంత ఆదాయం వచ్చిందో 1 వ పట్టిక తెలుపుతూంది.

11. పరోక్షపు పన్నులవలన వ్యవసాయాదాయాలమీదకలుగుతున్న ఫలితాలను గురించిన సమాచారం ఇంచుమించు లేదనిచెప్పాలి. పన్నుల విచారణసంఘం ప్రోత్సాహంతో ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూట్ వారు జరిపించిన నమూనా సర్వేఫలితాలు పన్నులభారం గురించి అంచనా తేల్చేటందుకు ప్రధాన సాధనాలుగా వున్నాయి. ఈ సర్వే 1953 – 54 సంవత్సరానికి జరిగింది. దీనిలో దిగువ పన్నుల భారం లెక్కలు తీయబడినాయి; సెంట్రల్ ఎక్సైజ్, రవాణా సుంకాలు, నల్లమందు పన్ను, సారా పన్ను, జనరల్ సేల్స్ టాక్సు, మోటారునూనెలపై సేల్సుటాక్సు, వినోదపు పన్ను, రాష్ట్రాలలో రవాణా పన్నులు చెరకు సెస్సు, మోటారు బండ్ల పన్ను.

12. గ్రామీణ ప్రాంతాల వ్యయంలో పరోక్షపు పన్నులు 2.9 శాతానికి మించవని 1953–54 నాటి లెక్కలు తీసిన ఆ పరిశీలకులు తేల్చారు. 1950 – 51 తర్వాత రాష్ట్రాలలో గాని, కేంద్రంలో గాని పరోక్షపు పన్నుల విధానమూ, రేట్లూ కూడ మొత్తంమీద మారలేదు ఈ మధ్యకాలంలో మొత్తం పన్నుల ఆదాయంలో పరోక్షపు పన్నులశాతం 60–65 ప్రాంతాలలో వుంది. జనరల్ సేల్సు టాక్సువంటి కొన్ని కొన్ని పన్నులు ప్రాధాన్యతకు వచ్చినా, ఇతర పరోక్షపు పన్నుల ఆదాయాలు తగ్గిపోయాయి అందుచేత ప్రణాళికల ఆరంభంనాటినుంచి మొత్తం ఆదాయంలోని పెరుగుదల కనుగుణమైన విధంగానే పరోక్షపు పన్నుల మొత్తం పెరుగుతూంది దానినిబట్టి గ్రామీణ ప్రాంతాల మొత్తం వ్యయంలో పరోక్షపు పన్నులశాతం 2.9 కి మించదని భావించడం తప్పుకాదు.

1 వ పట్టిక

| | 1950_'51 | 1951_'52 | 1952_'53 | 1953_'54 | 1954_'55 | 1955_'56 | 1956_'57 | 1957_'58 | 1958_'59 | 1959_'60 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| భూమిపన్ను (రాష్ట్రాలు) | 49.58 | 47.99 | 57.41 | 70.73 | 72.58 | 80.33 | 92.66 | 87.68 | 92.81 | 100.45 |
| వ్యవసాయాదాయాల పన్ను | 4.09 | 4.03 | 4.06 | 3.77 | 4.77 | 5.74 | 5.73 | 7.80 | 7.97 | 8.11 |
| ఎస్టేటు డ్యూటీలు (రాష్ట్రాలు) | — | — | — | — | 0.52 | 1.94 | 2.38 | 2.43 | 2.51 | 2.52 |
| భూమి పన్ను (కేంద్రం) | 2.00 | 2.88 | 0.43 | 0.76 | 0.45 | 0.88 | 0.54 | 0.35 | 0.57 | 0.54 |
| మొత్తం | 55.67 | 55.20 | 61.90 | 75.26 | 78.32 | 88.89 | 101.31 | 97.91 | 103.86 | 111.62 |

1958_'59 లకూ, 59_60 లకూ వేసినవి తాత్కాలిక అంచనాలు మాత్రమే.

13. ఇక్కడ మరొకటి కూడా వూహించడం అవసరం. వ్యవసాయ రంగంకంటె గ్రామీణరంగంవిస్తృతం. దీనిలో వ్యవసాయరంగమే కాకుండా చిన్న పరిశ్రమలు, వ్యాపారం, వాణిజ్యం, రవాణా మొదలయిన రంగాల విభాగాలు కూడా చేరి వుంటాయి. వ్యవసాయంలోకన్న వ్యవసాయేతర రంగాలలో ఆదాయాలు హెచ్చుగనక, పన్నుభారం కూడా ఎక్కువగానే వుంటుంది. అందుచేత వ్యవసాయరంగంలో ఈ పన్నుభారం 29 శాతం కన్న తక్కువగానే వుంటుందని భావించవచ్చు. అదీగాక వ్యవసాయ జనాభా మొత్తంమీద చూస్తే వారికి పెట్టుబడులుగా మారే ఆదాయాలు హెచ్చులేకపోయినా, వారి ఆదాయంకన్నఖర్చు ఏమాత్రమో తక్కువగానే వుంటుంది. వీటి నన్నింటినీ దృష్టిలో పెట్టుకొని, మొత్తం వ్యవసాయాదాయంలో పరోక్షపు పన్నులు క్రింద ఇచ్చేది 2 శాతం వుంటుందని వూహించవచ్చును.

14. పరోక్షపు పన్నుల్నిగురించి 1953–54 కు జరిగిన (సర్వే) పరిశీలనను ఒక విధంగా అసమగ్రం అనాలి. అందులో ఎగుమతి పన్నుల భారం కలపలేదు. ముఖ్యమైన వ్యవసాయోత్పత్తులు మూడిటిమీద ఎగుమతి పన్నులున్నాయి. తేయాకు, ముడిపత్తి – రద్దుపత్తి, నూనెగింజలు. ఈ పన్నులుకూడా మధ్య మధ్య పునరాలోచించబడుతుంటాయి. ఈ మధ్య కాలంలో ఒక్క 'టీ' మీద తప్ప మిగతా వానిపై వసూలయ్యే ఎగుమతి పన్ను మొత్తం క్రమంగా తగ్గిపోతూంది. ఎంత అనేది ఖచ్చితంగా చెప్పడం కష్టం. అయినా ఎగుమతుల పన్నుల మొత్తం ఆదాయంలో 20 శాతం వ్యవసాయవస్తువులనుంచి లభిస్తూందనవచ్చును.

15. ఈ మధ్యకాలంలో వ్యవసాయరంగంలో వసూలయ్యే పన్నుల మొత్తం అంచనా ఇప్పుడు తేల్చుకోవచ్చు.

16. వ్యవసాయ రంగంలోనూ, తదితరత్రానూ పన్నులభారం ఎంతెంతగావుందో ఇప్పుడు తేల్చగలం. మూడోపట్టికలో ఈ విషయాలు క్రోడీకరించబడ్డాయి.

17. దీనినిచూస్తే భారతదేశపు పన్నుల పద్ధతిలోని కొన్ని లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి. దేశాదాయంలో సగభాగం వ్యవసాయంవలన లభిస్తూంది. అయితే ఈమధ్యకాలంలో వసూలవుతున్న మొత్తం పన్నుల ఆదాయంలో వ్యవసాయరంగంనుంచి వస్తున్నది 20 నుంచి 25 శాతం వరకే వుంటూంది. నిజం చెప్పాలంటే దేశంలోపన్నుల విధింపు రెండు రకాలుగావుంది. ప్రభుత్వానికి పన్నులనుంచివచ్చే ఆదాయంలో నాలుగు శాతం మాత్రమే వ్యవసాయ రంగంనుంచి వస్తుంది. వ్యవసాయేతర రంగాలనుంచి 10 శాతం వస్తుంది. ప్రస్తుతం ప్రభుత్వానికి పన్నులవలన వచ్చే ఆదాయం సగటు 8 శాతం వుంటుంది. ఆ మాటచెప్తే మనపన్నుల

2వ పట్టిక

## భారతీయ వ్యవసాయంమీద పరోక్షపు పన్నుల ఒత్తిడి

(కోట్ల రూపాయలలో)

| | 1950–'51 | 1951–'52 | 1952–'53 | 1953–'54 | 1954–'55 | 1955–'56 | 1956–'57 | 1957–'58 | 1958–'59 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఎగుమతి పన్నులుగాక తదితరాలు | 95 | 98 | 94 | 104 | 85 | 88 | 107 | 103 | 123 |
| ఎగుమతి పన్నులు | 9 | 18 | 11 | 8 | 8 | 8 | 6 | 5 | 4 |
| మొత్తం | 104 | 116 | 105 | 112 | 93 | 96 | 113 | 108 | 127 |

వ్యవస్థ రెండురీతులుగా వుంటూందన్న అసలు విషయం అర్థంకాదు.

18. మూడో పట్టికనుంచి మరో సంగతికూడా అర్థం అవుతుంది. వ్యవసాయేతర రంగ విభాగాలలో పన్నుల భారం ఈ మధ్యకాలంలో హెచ్చింది. చాలా సందర్భాలలో ఆ పెరుగుదల రేటు అంతగా కనబడకపోవచ్చు. అయినా పన్నుల ఆదాయం విస్తరించింది. ఈమార్పుదలలోకూడ వ్యవసాయరంగంనుంచివచ్చే పన్నుల ఆదాయము పెరగలేదు. అందుచేత 1951–52 లో పంచవర్ష ప్రణాళికలు ప్రారంభం అయినప్పటినుంచీ, ఇతర రంగాలలోకన్న వ్యవసాయరంగంలో పన్నులభారం తగ్గింది.

19. తలసరి ఆదాయాల తరతమ స్థాయిలలో చాల ఎక్కువ అంతరం గనక వుంటే, మొత్తం ఆదాయాలనూ, పన్నుల భారాన్నీ చెప్పడంవలన ఎవరు ఎక్కువ భారం మోస్తున్నదీ చెప్పలేము. అందుచేత వ్యవసాయం లోనూ, తదితర రంగాలలోనూ ఏవో కొన్ని అంశాలను పట్టుకొని తలసరి ఆదాయం లెక్కలు చూపిస్తూ, 4వ పట్టిక వ్రాశాను. దానిలో ఆ రెండు రంగాలలోనూ తలసరి ఆదాయాలూ, తలసరి పన్నులభారమూ చూపించాను. వ్యవసాయంలోనూ, బయటా పన్నులూ, ఆదాయాలూ ఏ విధంగా వున్నాయో తెలుసుకోడానికి తోడ్పడతాయి.

20. అనేక ఏళ్లుగా ఇతర రంగాలలోని తలసరి ఆదాయంలో వ్యవసాయ రంగంలో తలసరి ఆదాయం 33 నుంచి 40 శాతంవరకే వుంది. కాని, పన్నుల సమస్య వచ్చేసరికి, వ్యవసాయేతర రంగాలలోని తలసరి పన్నులభారంలో వ్యవసాయ రంగంలోని తలసరి పన్నులభారం 10 నుంచి 15 శాతం మాత్రమే వుంది.

21. దీనిని రెండు కోణాలనుంచి చూడవచ్చు. వ్యవసాయేతర రంగంలో పన్ను విధింపు గట్టిగా వున్నదనడానికి అర్థం క్రమాధికంగా పన్నులు వేసే పద్ధతి అమలులోకి వస్తూందనడానికి చిహ్నం అని కొందరు అంటారు. ఒక తరహాజనం యొక్క ఆదాయం మరొక తరహావారి ఆదాయం కన్న రెండున్నర రెట్లున్నప్పుడు కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఆరురెట్లూ, ఏడురెట్లూ పన్ను ఇస్తున్నారన్నా తప్పు లేదంటారు. మొత్తం ఆదాయాలనూ, మొత్తం పన్నును పోల్చిచూసినప్పుడు కనిపించేదానికన్న వ్యవసాయేతర రంగాలలో పన్నుల భారం నిజానికి తక్కువగా వుందనే వాదన కూడా వుంది వ్యవసాయేతర రంగాల పన్నుల వసూలు మొత్తంనుంచి పెద్దపెద్దకంపెనీలూ, కార్పొరేషన్లూ ఇచ్చే పన్నుని మినహాయిస్తే వ్యవసాయరంగంలోనూ ఇతరత్రానూ వుందనిచెప్పే తేడా బాగా తగ్గిపోతుందని వారంటారు.

22. అయితే తద్విరుద్ధమైన చిత్రాన్ని చూపడం కూడా సులభమే. మొత్తం అనేటప్పటికి ఏరంగంలోనైనా మొత్తమే తీసుకోవాలి. వ్యవసాయేతర రంగంలో కార్పొరేషన్లనీ,

3వ పట్టిక

# భారతీయ ఆర్థిక విధానంలో పన్నులు

(శాతాలలో)

| | 1950–'51 | 1951–'52 | 1952–'53 | 1953–'54 | 1954–'55 | 1955–'56 | 1956–'57 | 1957–'58 | 1958–'59 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| వ్యవసాయంలో ప్రత్యక్ష పన్ను | 1.2 | 1.1 | 1.4 | 1.4 | 1.8 | 2.0 | 1.8 | 1.8 | 1.7 |
| పరోక్ష పన్ను | 2.2 | 2.4 | 2.3 | 2.2 | 2.2 | 2.2 | 2.1 | 2.1 | 2.0 |
| మొత్తం | 3.4 | 3.5 | 3.7 | 3.6 | 4.0 | 4.2 | 3.9 | 3.9 | 3.7 |
| వ్యవసాయేతర రంగంలో పన్ను | 9.9 | 11.2 | 9.3 | 9 1 | 10.1 | 10.2 | 10.9 | 13.4 | 12.8 |
| మొత్తంపన్నులలో వ్యవసాయవుపన్నులు | 25.3 | 23.1 | 24.9 | 28.0 | 24.0 | 24.4 | 24.5 | 19.2 | 21.8 |
| జాతీయాదాయంలో వ్యవసాయాదాయం | 50.2 | 49.2 | 48.0 | 49.6 | 44 0 | 44.0 | 47.6 | 45.5 | 48.6 |
| జాతీయాదాయంలో పన్నులు | 6.6 | 7.4 | 6 8 | 6.4 | 7.4 | 7.5 | 7.6 | 9.2 | 8.4 |

**4వ పట్టిక**

## భారతీయ ఆర్థికవిధానంలో తలసరి పన్నుల భారం

| | 1950-'51 | 1951-'52 | 1952-'53 | 1953-'54 | 1954-'55 | 1955-'56 | 1956-'57 | 1957-'58 | 1958-'59 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| తలసరి ఆదాయం: | | | | | | | | | |
| 1. వ్యవసాయం | 126 రు. | 127 రు. | 185 రు. | 201 రు. | 160 రు. | 163 రు. | 195 రు. | 184 రు. | 213 రు. |
| 2. వ్యవసాయేతరం | 451 రు. | 471 రు. | 466 రు. | 472 రు. | 472 రు, | 480 రు. | 500 రు. | 511 రు. | 533 రు, |
| తలసరి పన్ను: | | | | | | | | | |
| 3. వ్యవసాయం | 6.5 రు. | 6.9 రు. | 6.6 రు. | 7.2 రు, | 6.5 రు. | 6.8 రు. | 7.7 రు. | 7.3 రు. | 7.7 రు. |
| 5. వ్యవసాయేతరం | 44.5 రు. | 52.9 రు. | 43.1 రు. | 43 రు. | 47.5 రు. | 48.8 రు. | 54.3 రు. | 69.4 రు. | 66.8 రు, |
| 5. 1 లో 2వ అంశం శాతం | 13.7 | 41 8 | 39.7 | 42.6 | 34 | 34 | 39 | 36.1 | 40.1 |
| 6. 3 లో 4వ అంశం శాతం | 14.6 | 13.0 | 15.3 | 16.7 | 13.7 | 13.9 | 14.2 | 10.4 | 11.7 |

పెద్ద కంపెనీలనీ మినహాయించమంటే వ్యవసాయ రంగంలో పెద్దపెద్దతోటల కంపెనీలిచ్చే పన్నుల్ని మినహాయించమని అసలి వారంటారు. రెండు దృక్పథాలనూ గనక పరిశీలించినట్లయితే భారత దేశంలో వ్యవసాయంమీద పన్ను తక్కువగానే వుందికదా యనే ప్రశ్నరాక తప్పదు.

23. వ్యవసాయంలోనూ, వ్యవసాయేతర రంగంలోనూ పనిచేసే వారు భరిస్తున్న పన్నుల భారంలోని తేడాను సరిచెయ్యడంకోసం చెప్తున్నదేగాని ఇది అందరికీ సమానంగా పన్నులుండాలనే సమానత్వ సూత్రం కోసం చెప్తున్నదికాదు. వ్యవసాయ రంగంలో చాలమంది కడుపునకు చాలీచాలని తిండితో జీవిస్తున్న సందర్భంలో ఆ రంగానికి లోపలా-బయటా పన్నులు సమాన స్థాయిలో వుండాలనడంలో అర్థంలేదు. వ్యర్థం కూడాను. అందుచేత విడివిడిగావున్న రెండు ఆర్థిక సత్యస్థితులను పరిశీలించడం సమస్య వస్తూంది. వాణిజ్యం మీదా పరిశ్రమలమీదా పన్నుల భారాన్ని తగ్గించేటందుకు వ్యవసాయంలో పన్నులను హెచ్చించవలసి వుంటుందనే ఆలోచన నిరాకరించవలసిందే భారాన్ని సరిపుచ్చాలనే టందుకు సమర్థవంతంగా వాదనలను తేగలిగినా, నిర్ణయాలను చెయ్యడంలో సందర్భపడే రాజకీయ-సాంఘిక పరిణామాలదృష్ట్యా వానిని అమలు జరపడం అసంభవం.

24. అయితే మరొక విషయాన్ని ఆలోచనలో పెట్టవచ్చునుకదా అంటారు. ఒక్క వ్యవసాయంలోనే అంతటా పన్ను పెంచ్చించ పూనుకుంటే తీవ్ర ప్రతిఘటన ఏర్పడవచ్చు. కాని, వ్యవసాయేతర రంగాలవారినికూడా ఇదివరకటి కన్న ఎక్కువ పన్ను ఇవ్వాలని కోరి వారినుంచి తీసుకొనే సందర్భంలో వ్యవసాయదారులు కూడా ఎక్కువ ఇవ్వక పోతారా? రాబోయే చాల ఏళ్ళ వరకూ పన్నుల ఆదాయాన్ని సాధ్యమైనంత ఎక్కువ చేయడకం అవసరం. వివిధ రంగాలలోని పన్నుల భారాన్ని ఎక్కడ ఎంత పెంచినా అసలు పన్నులు ఎక్కువచేసే విధానాలు చాల అవసరం. ఇతర రంగాలలో పన్నులు హెచ్చించినప్పుడు వ్యవసాయంలో కూడా ఎక్కువచేసే అవకాశం వుండేటట్లయితే అలా చెయ్యక పోవడం మంచిది కాదు; పన్నులభారం సాపేక్షకంగా ఇంకా వికృతంగాతయారవుతుందని భయపడరాదు. అటువంటి పరిస్థితులలో వ్యవసాయేతర రంగాలలో-న్యాయం తప్పకుండానే-పన్నులు ఎక్కువచేసి వ్యవసాయ రంగంలోకూడ హెచ్చు చేసేటందుకు అనువు కలిగించాలి.

25. ఒకేమారు రెండు రంగాలలోనూ హెచ్చించడంలో కొన్ని ఇతర సౌకర్యాలున్నాయి. ఈ మధ్య ఆదాయపు పన్ను విధించే కనీస పరిమితిని 3 వేల రూపాయలకన్నా తగ్గించేటందుకు ఆలోచనలు సాగుతున్నాయి.

ఈ మూడువేలు అన్నది దేశంలోని సగటు ఆదాయానికి పదిరెట్లు వుంది. ఈ తేడా ఇతరదేశాలలో వున్నదాని కన్న చాల ఎక్కువ. ఆ దేశాలలో సాధారణంగా ఈ అంతరం అయిదింతలను మించివుండడంలేదు. పన్ను వేసే ఆదాయపు పరిమితిని తగ్గించడం వలన దేశసత్వరాభివృద్ధికోసం ఒక మాదిరి ఆదాయాలుగల వారుకూడా తోడ్పడే అవకాశం లభిస్తూంది. వ్యవసాయాదాయాలమీద ప్రత్యక్షంగా పన్ను వేసేటందుకు అవకాశాలులేని సందర్భంలో ఈ పరిమితిని తగ్గించడం రాజకీయంగా కష్టతరమైన పని.

26. వ్యవసాయంమీదనూ, ఇతర ఆర్థిక రంగాలలోనూ పన్నులు సరిపుచ్చాలనే విషయంమీద జరుగుతున్న ఈ చర్చలో కొంత వైరుధ్యం కనబడుతుంది. రాబోయే సంవత్సరాలలో భారతదేశంలోని అన్ని ఆర్థిక రంగాలలోనూ పన్నులు పెంచాలన్నప్పుడు, వేర్వేరు రంగాలలోని పన్నుల మధ్య వున్న అంతరాలను అదేవిధంగా వుంచెయ్యాలన్నట్లు అర్థం తీయకూడదు. ఇది అన్నింటిలోనూ ప్రధానమైనదీ, చతురతతో నిర్వహించదగినదిన్నీ. వ్యవసాయ రంగంలోనూ, తదితర రంగాలలోనూ శక్తికి తగినంతగా పన్ను వెయ్యడంలేదనే అభిప్రాయానికి వస్తే, సర్వతోముఖంగా పన్నులువేసే పనికి గట్టిగా పూనుకోవాలి. ప్రస్తుతం వున్న రాజకీయ పరిస్థితుల దృష్ట్యా ఏదో ఒక రంగంలో పన్నుమొత్తాన్ని పెంచి, వసూలు చెయ్యడం సాధ్యమయ్యే పనికాదు. పెరుగుదల అన్నిచోట్లాసమానంగానే వుండాలనేదికాకపోయినా, ఇతర రంగాలలోకూడ అట్టిమాదిరి చర్యలనే తీసుకోవాలి. తమకొక్కరికే పన్ను వెయ్యడంలేదనే సంతృప్తి కలిగితే, కొత్త పన్నులు ఎవరికి ఎంత తగులుతుందనేదాన్ని ఎవ్వరూ పట్టించుకోరు. కొత్త పన్నులు వేసేటప్పుడు అదనపు పన్ను భారం వ్యవసాయానికి వ్యతిరేకంగా వున్నా, అధికారులకేమీ ఇబ్బంది కలగదు.

27. ఇతర దేశాలతోపోల్చిచూపి, భారత దేశంలో వ్యవసాయంమీద ఇంకా పన్నులు వెయ్యడం అన్యాయమనే మాటను ఒప్పించడం సాధ్యంకాదు. 1893–97 ల మధ్య జపానులో వ్యవసాయంలోనూ పరిశ్రమలలోనూ సగటు ఆదాయం ఈనాడు ఇండియాలోవున్నట్టే వున్నాయి. జాతీయాదాయంలో 45–50 శాతం వరకూ వ్యవసాయంనుంచి వచ్చేదే. అయితే మొత్తం పన్నుల ఆదాయంలో 20 శాతం మాత్రమే ఇండియాలో వసూలవుతూంది. కాని జపానులో 1893–94 లో వసూలయిన పన్ను మొత్తంలో 45 శాతం వరకూ భూమిశిస్తునుంచి వచ్చిందే (8.58 లక్షలయెన్నులలో 3.88 లక్షలు భూమి పన్నునుంచి వచ్చినదే.) భారతదేశంలో పన్నులు తక్కువగావున్నాయనడానికి వుదాహరణ చాలు.

28. బడ్జెట్టుద్వారా ఇతర రంగాలనుంచి వ్యవసాయరంగానికి లభిస్తున్న

సహాయం గురించి ఇక్కడ కొంచెం చెప్పడం అవసరం. మొదటి ప్రణాళిక అయిదేళ్ళలోనూ ఈ సహాయం ఎంత వుందో పరిశీలిద్దాం. 1951-56 ల మధ్య యూనియన్ ప్రభుత్వం చేసిన ప్రణాళికేతర వ్యయం 1939 కోట్లూ, రాష్ట్ర ప్రభుత్వాలు చేసినది 1927 కోట్లూను. ప్రణాళి కేతరవ్యయంలో వ్యవసాయరంగానికి ఖర్చు చేసినది 20 శాతం వుంటుందని వూహించడం చాలసముచితమైన వూహ. ఆ లెక్కని ప్రభుత్వం వ్యవసాయానికిగాను ప్రణాళికేతర వ్యయం 773 కోట్లు చేసినట్లు తేలుతుంది. ప్రణాళికలో వ్యవసాయానికి, నీటి పారుదలకీ కేటాయించినది 610 కోట్లు. అంటే మొత్తం వ్యవసాయానికి అయిదేళ్ళలోనూ చేస్తున్న ఖర్చు రమారమి 1400 కోట్ల రూపాయలన్న మాట.

29. 1951-56 ల మధ్య వ్యవసాయంనుంచి ప్రభుత్వానికి వచ్చిన ఆదాయం రమారమి 880 కోట్లు. పన్నురూపంలో గాకుండా ప్రభుత్వానికి వ్యవసాయ రంగంనుంచి వచ్చిన ఆదాయాన్ని దీనికి జతపరచాలి. ఈ పద్దుక్రింద ఈ అయిదేళ్ళలో వచ్చిన ఆదాయం నీటి పారుదలవలన వచ్చినది 47 కోట్ల రూపాయలు మాత్రమే. అంటే వ్యవసాయంనుంచి ఆ అయిదేళ్ళలో ప్రభుత్వానికి వచ్చింది 925 కోట్ల రూపాయలు మాత్రమే.

30. ఇవిగాక పెట్టుబడుల రూపంలో ప్రభుత్వ నిధికి వ్యవసాయరంగంనుంచి వచ్చిన ధనం కొంత వుండడానికి అవకాశంవుంది. ప్రథమ ప్రణాళిక కాలంలో ప్రభుత్వానికి చేకూరిన పెట్టుబడుల ధనం మొత్తం 600కోట్లు. దానిలో ప్రభుత్వ రుణం 205 కోట్లు. చిన్న మొత్తాలపొదుపు, చిల్లర అప్పుల ద్వారా 304 కోట్లు. ప్రావిడెంట్ ఫండ్ తదితర మొత్తాల బాపతు సొమ్ము 91 కోట్లు. వీటన్నింటిలో వ్యవసాయ రంగంనుంచి వచ్చిన మొత్తం చిన్న మొత్తాల పొదుపు విభాగంలోనే వుంటుంది. ఆ విభాగంలో వసూలయిన దాంట్లో వ్యవసాయంనుంచి వచ్చినది 10 శాతానికి మించదు.

31. దీనిని బట్టి 1951-56 ల మధ్య ప్రభుత్వానికి వ్యవసాయ రంగంనుంచి లభించిన మొత్తం అంతా చేర్చినా 950 కోట్లకు మించదని చెప్పవచ్చును. కాని ఆ అయిదేళ్ళలో ప్రభుత్వం ఆ రంగంలో 1400 కోట్ల రూపాయలు ఖర్చు చేసింది దీనినిపట్టి ప్రథమ ప్రణాళికా కాలంలో భారతీయ ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయ రంగం బాగా నష్టంతో నడుస్తూన్న రంగం అని చెప్పవచ్చు. రెండో ప్రణాళికా కాలం అంతిటికీ పరిస్థితిలో మార్పు ఏమన్నా వచ్చిందేమో చెప్పడానికి అవకాశంలేదు. కాని మొదటి మూడేళ్ళ సమాచారం చూస్తే వ్యవసాయ రంగం ఇతర రంగాలనుంచి డబ్బు తీసుకునే బ్రదుకుతున్నదనాలి.

32 భవిష్యత్కర్తవ్యం ఏమిటనాలి? ప్రణాళికా బద్ధమైన అభివృద్ధి ఇంకా చాలకాలంపాటు కొన

సాగుతుందనీ, పెట్టుబడులలో అధిక భాగం ప్రభుత్వమే పెడుతుందనీ అనుకోవలసివస్తే మూడేమూడు మార్గాలు మనకు కనిపిస్తాయి. (క) ప్రస్తుత స్థితినే కొనసాగించడం. వ్యవసాయేతర రంగాలనుంచి డబ్బుతెచ్చి వ్యవసాయరంగాన్ని ఆదుకొంటూనే వుండడం. (గ) ప్రస్తుతస్థితిని తల్లక్రిందులు చేయడం ఎప్పుడూ రుణంచేసి బ్రదికే స్థితినుంచి వ్యవసాయాన్ని ఇతరఆర్థిక రంగాలలో వినియోగించేటందుకు వీలయినంత అదనపు రాబడి తెచ్చేటట్లు చేయడం (చ) లేదా, అదనం వచ్చినా రాకపోయినా, కనీసం ఆ రంగంలోని ఖర్చుకు సరిపడేటంతయినా ఆదాయం వచ్చేటట్లు పన్నులు పెంచడం.

33. ఏ పంథా త్రొక్కితే ఎంతమొత్తం కావలసి వస్తుందో చూసి దానినిబట్టి వాని మంచిచెడ్డలను పరిశీలిద్దాం. వ్యవసాయరంగంలో మిగులు నామమాత్రంగా చూపించ దలచుకొన్నా, ఆ రంగం నుంచి పన్నుల ఆదాయం ఇప్పటికన్న 150 శాతం ఎక్కువ కావాలి. అలాగాక ఇప్పటిలాగే ఇతరరంగాలనుంచి నం తెచ్చి విరాళాలతో వ్యవసాయ రంగాన్ని బ్రతికించ దలచుకొంటే ఇతర రంగాలమీద ప్రభుత్వం పన్నులను పెంచాలి. వ్యవసాయానికి కావలసివుండే విరాళం క్రమంగా పెరుగుతుందేకాని తరగదు. మిగిలిన ఆర్థిక విభాగాలలో ప్రభుత్వరంగం క్రమంగా విస్తరిస్తుంది. అందుచేత వ్యవసాయేతర విభాగాలలో పన్నురేటు పెంచవలసి వుంటుంది. అంటే ఇదివరకటికన్న వానిలో 12,13 శాతం వరకూ పన్ను పెంచాలి. వ్యవసాయరంగాన్ని స్పృశించకుండా, తదితర రంగాలలో పన్నులు పెంచడం సాధ్యమా అన్నది ఆలోచించ వలసిందే.

34. చ—లో చెప్పిన దానిని స్వల్ప వ్యవధి కార్యక్రమంగా ప్రస్తరించి అమలు జరిపితే అదొక రాజీ పద్ధతిగా వుంటుంది. వ్యవసాయరంగం నుంచే వచ్చే పన్నుల ఆదాయాన్ని రెట్టింపు చేస్తే, ఆ రంగంలోని వనరుల లోటు ఇంచుమించు తీరుతుంది. ఆ పని పూర్తికావడానికి ఏ అయిదేళ్ళో, ఏడేళ్ళో గడువు పెట్టుకోవచ్చు. ఇల్లాగ నెమ్మదిగా పరిమిత రూపంలో కార్యక్రమాన్ని సాగించడంవలన పన్నుల సంస్కరణలు తీవ్రమైన రూపంలో ప్రవేశపెట్టడంవలన కలిగే ఇబ్బందులు తగ్గుతాయి. ప్రస్తుతం వున్న వ్యవస్థలోనే వానిని క్రమంగా దూర్చవచ్చు. అది సాగినకొద్దీ వ్యవసాయేతర రంగంలోకూడ పన్నులు కొత్తవి వేసేటందుకు అనువైనవాతావరణాన్ని కల్పించవచ్చును.

35. ఇక్కడ మన కింకో సమస్య ఎదురవుతుంది. వ్యవసాయ రంగం నుంచి ఆదాయం అధికం రావాలి. బాగుంది. అయితే, అదెల్లా? కొత్త పన్నులువేసి రాబట్టడమా? వ్యవసాయ రంగంలో కలిగిస్తున్న కొన్ని ప్రధాన సౌకర్యాలనుంచి డబ్బు రాబట్టడమా? భూమిపన్నులను హెచ్చించడం వలన ఆర్థికాభివృద్ధికి లాభంకన్న నష్టం

ఎక్కువ వుందని చెప్పే సమానతా వాదులు చాలమంది వున్నారు. వ్యవసాయపు పన్నులు హెచ్చించాలనేటప్పుడు ఆదాయపు పరిమితుల హెచ్చు తగ్గులను గమనించడం జరగదనీ, దాని వలన మంచిభూములు కలవారూ సారహీనములైన భూములు కలవారూ కూడా ఒకేవిధంగా ఇవ్వవలసివుంటారనీ, ఇదివరకేవున్న అసమానతల నదిఇంకా కొనసాగిస్తుందనీ వారి వాదన. వ్యవసాయంలో పెరిగిన, మిగులు ఆదాయంలో కొంత ప్రభుత్వానికి చేరాలనేదే ఈ పన్నులు వేయడంలోని వుద్దేశం గనక చేయవలసిన పని నీటి పారుదల తీరువా రేటు హెచ్చించడం – బాగుపడిన భూములమీద అభివృద్ధి పన్నులు వేయడం, రైతులకిచ్చిన రాసాయనికపు ఎరువులమీద మంచిలాభం మిగిలేటట్లు ధరలు నిర్ణయించడం లాంటివి చేయవచ్చునని వారి వాదన. ఈ విధంగా అయితే రైతుల కిచ్చిన సహాయానికీ, వసూలు చేసిన సొమ్ముకూ సరితూకం ఏర్పడగలదనీ, ఆ పథకం రాజకీయంగా అంగీకారయోగ్యం కావడమే గాక ఆర్థికంగా లాభకరమనీ అనవచ్చు. పెద్ద చిన్న తేడాలేకుండా అందరికీ ఒకే పన్ను వేసే పద్ధతి పోతుంది; అదనపు లాభాలు పొందేవారే తమ అదనపు ఆదాయంలోంచి కొంత భాగాన్ని ఇచ్చుకొంటారు.

36. వ్యవసాయంమీద పన్ను వేయడానికి బదులు చేస్తున్న సహాయాలకు డబ్బుతీసుకోవడం అనే పద్ధతి చూస్తే ఆశాజనకంగానే వుంటుంది. అయితే రెండో ప్రణాళికాకాలంలో ఈ విషయంలో పెద్ద ప్రయత్నమే జరిగింది. కాని ఫలితాలుమాత్రం నిరుత్సాహకరంగానే వున్నాయి. 1956 తర్వాత అనేక రాష్ట్రాలు అభివృద్ధి పన్నులు విధించబోయాయి. ఒక్కొక్కచోట ఎకరానికి 150 రూపాయలవరకూ విధించి పదిహేనేళ్ళలో దానిని చెల్లగట్టాలన్నారు. పెద్ద ప్రాజెక్టులవలనా, మధ్యతరహా ప్రాజెక్టులవలనా రమారమి 90 లక్షల ఎకరాలు 1958–59 నాటికి అదనంగా సాగులోకి వచ్చివుండాలి. కాని అభివృద్ధి పన్నులరూపంలో ఇంతవరకు వసూలయినది కొద్దిమాత్రమే. 1958 మే నెలలో ప్రణాళికాసంఘంచేసిన ఈ వ్యాఖ్య గమనించదగివుంది.

"అభివృద్ధి పన్నులద్వారా 47 కోట్లు వసూలవుతుందని భావించబడింది [వానిలో కేంద్రానికి అప్పు తీర్మానానికై 31 కోట్లు ఇస్తారనీ, 16 కోట్ల రూపాయలను రాష్ట్రాలు తమ స్వంత పథకాలకై వినియోగించుకొంటాయనీ భావించబడింది.] కాని, గత సంవత్సరం డిసెంబరు – జనవరి నెలలలో ప్రణాళికా సంఘంతో ఆ రాష్ట్రాల వారు సంప్రదించినప్పుడిచ్చిన లెక్కల్ని బట్టి ప్రణాళికాకాలం మొత్తంమీద వసూలయ్యేది ఆరు కోట్లే లెక్కతేలింది. కాని నిజానికి ఇంతవరకు తీసుకొన్న చర్యల్ని

బట్టిచూస్తే వసూలయ్యేది 2 కోట్లు మాత్రం వచ్చేలావుంది."

37. నీటి తీరువారేట్లు వలన వచ్చే ఆదాయంకూడా అంతగా పెరగలేదు. దీనికి ప్రధాన కారణం పరిపాలనా నిర్వహణలోని లోపమే. ఈ విధంగా ప్రభుత్వం ఇచ్చే సహాయాలకు విధించే రుసుములను వసూలు చేయడానికి ప్రత్యేకంగా, కట్టుగిట్టాలతో కూడిన నిర్మాణం వుండాలి. అసలే గ్రామ స్థాయిలో పరిపాలనానిర్వాహక బలగం బలంగా లేదు. దానికితోడు ఇన్ని పన్నులు, ఇన్నితరహాల వసూలు పద్ధతులు మరింత గంద్రగోళాన్ని కలిగిస్తాయి. భూములకు తగినంత నీరు సరఫరా చేయడం ప్రభుత్వ విధులలో ఒకటిగనక, ఆ పనిచేసినందుకు ప్రత్యేకంగా పన్ను విధించడం అన్యాయమని రైతాంగం భావిస్తుంది. అవసరమయిన విత్తనాలు, ఎరువులు, నీరు మొదలయినవి సరఫరాచేసి లాభాలు గడించడం ప్రభుత్వానికి తగదనిచెప్పే సమతావాదులు చాలమంది వున్నారు.

38. ఇక్కడే మరొక ఆలోచన కూడా వుంది. ఇటువంటి ప్రత్యేక వసూళ్ళ వలన వ్యవసాయోత్పత్తి వేగంగా పెరగడానికి బదులు దెబ్బ తింటుందనే వాదన ఒకటుంది. భారతీయ వ్యవసాయ సమస్యలో ముఖ్యం ఏమిటంటే రైతు జనాభాలోని గతానుగతికములైన ఆలోచనాధోరణులను విచ్ఛిన్నం చేయడం. అలాజరిగినప్పుడు వారు తమంత తామే వ్యవసాయ పద్ధతులను మార్చుకొని మంచివి ఎన్నుకొంటారు. నీరు, విత్తనాలు, ఎరువులు ఎక్కువగా వాడుతారు. వీటినిచ్చినందుకు ధర ఎక్కువ వసూలుచేస్తే అభివృద్ధి ఆవేశం చప్పున చల్లారిపోతుంది. వెనకటిలాగే రోజు గడిస్తే చాలునులే అనే వెనకటి ఆలోచనలకే పడిపోతాడు. మామూలు ధరలకు, అవసరపడితే ప్రత్యేక సందర్భాలలో నష్టం భరించి తక్కువ రేట్లకే వీటిని అందించి ప్రోత్సహిస్తే వ్యవసాయం వృద్ధిపొందడంవలన కలిగే అదనపు ఆదాయంలో కొంత భాగాన్ని ప్రభుత్వానికి ఇవ్వడాని కాతడు సందేహించడు - ఈ వాదనలకు అంతువుండదు. మాలుగుమోతులయిన రైతులు పంటలను హెచ్చు చేసేటందుకై మంచి పద్ధతుల నవలంబించేటట్లు చెయ్యాలంటే భూమి పన్ను పెంచడం మంచి పద్ధతులలో ఒకటనీ చెప్పవచ్చును కొందరు.

39 ఇంక ఇతర వాదనల కవకాశం లేనప్పుడు మామూలుగా తెచ్చే వాదం ఒకటి వుండనేవుంది. ప్రత్యక్ష పన్నులను హెచ్చించడంవలన చిన్న ఆస్తిపరులు నష్టపడతారని కొందరంటారు. ఆ విధంగా కొత్తపన్నులను వెయ్యడంలో తక్కువ ఆదాయంగల వారికరక్షణల నిస్తూ, వసూలుచేయడం ఎల్లాగ అనేది సమస్యగా తయారవుతూంది.

40. భారతీయ వ్యవసాయ రంగంలో ఆదాయాలలో ఎంతెంతో తేడా లున్నాయి. అందుచేతనే అభివృద్ధి క్రమాధికమైన పన్నుల పద్ధతిని

ఇక్కడ అమలుజరపడం చాల సులభం. ఆదాయాలలో వార ఎక్కువ వున్నప్పుడు, మిగులు మొత్తం ఎక్కువగా వుంటుంది. ఆర్థికసమాలోచనలు జరిపేటప్పుడు ఈఆలోచన సర్వసాధారణం. భారతదేశంలో ఆ వార చాల ఎక్కువగా వున్నా, వ్యవసాయేతర రంగంలో పెట్టుబడులు తగినంతగా సమకూడడం లేదు. కనక, ప్రభుత్వం పూనుకొని పన్నులస్థాయి పెంచడం అవసరం అవుతూంది. జాతీయ నమూనా సర్వేక్రింద జరిగిన భూకమతాల మొదటి నివేదిక చూస్తే భారతీయ వ్యవసాయంలో అసమానమైన పంపకం ఏ రూపంలో వుందో కనబడుతుంది. ఆ సర్వే లెక్కల ప్రకారం గ్రామాలలోవున్న ఆరుకోట్లు అరవైలక్షల కుటుంబాలలో కోటిన్నర కుటుంబాలకు, అంటే 22 శాతం కుటుంబాలకు ఏమీభూమి అనేదిలేదు. మరో 25 శాతం కుటుంబాలకు ఒక్క ఎకరంకన్న తక్కువే చొప్పున భూమి వుంది. ఇదిల్లా వుండగా 13 శాతం కుటుంబాలకు మొత్తం భూమిలో 65 శాతం భూమి మీద శాశ్వత హక్కువుంది. ఇది 1953-54 నాటి లెక్కలు. మధ్య దళారుల్ని రద్దు పరచడమనేది ఆనాటికప్పుడే చాలవరకు పూర్తి అయిపోయింది కనుక అటుతర్వాత ఆ పరిస్థితిలో మార్పులు పెద్దగా వుంటాయనుకోజాలము.

41. కుటుంబానికి ఎంత గరిష్ఠ పరిమితి భూమి వుండాలనే విషయం మీద ఈ మధ్య చాలా చర్చలు జరిగాయి. ప్రణాళికాసంఘంవారి కోరిక మీద అనేక రాష్ట్రాలలో కమతాల పరిమితులను అనుశాసిస్తూ చట్టాలు చేయబడ్డాయి. మిగిలిన రాష్ట్రాలలోకూడ అటువంటి చట్టాలు తయారు అవుతున్నాయి. గరిష్ఠ పరిమితులను విధించడంలో ఆర్థికంగా వున్న లాభనష్టాలను గురించి పెద్ద చర్చ సాగుతూంది. భూసారం, నీటి పారుదల సౌకర్యాలు, పండే పంటల స్వభావం మొదలయిన వానినిబట్టి ఏ ప్రాంతంలో గరిష్ఠపరిమితి ఎంత వుండాలనే విషయంమీద నిర్దిష్ట రూపంలోకూడ ఆలోచనలు జరుగుతున్నాయి. అయితే దీనిలో అనేక రాజకీయాలు ఇమిడివున్నాయి. అక్కడా అక్కడా చేసిన ఒకటిరెండు చట్టాలు తప్ప మొత్తంమీద సమస్య అంతా గందరగోళంగానే వుంది. వచ్చే కొద్ది సంవత్సరాలలో నిర్దిష్ట రూపంలో నిర్ణయాలు తీసుకోబడగల ఆశలేదు. భవిష్యత్తులో ఈ సమస్య ఏ విధంగా పరిష్కరించబడ్డాసరే, భారతీయ వ్యవసాయరంగంలో భూమి పంపకంలో తేడాలుండడం తప్పదనే తోస్తూంది.

42. భూ వ్యవస్థలో పెద్ద అంతరువులు లేకుండా క్రమంగా సరిదిద్దడం జరుగుతుంది అనుకోవచ్చు. అందుచేత ఒకపరిమితికి మించిన భూమిగలవారి మీద తరహాలవారీగా పన్నులు వెయ్యాలనేవారి వాదాలకు బలం చేకూరుతుంది సమీప భవిష్యత్తులో.

ఆ మాదిరి అదనపు పన్నులు వెయ్యాలనే వారివాదం తీవ్రం అవుతుంది.

43. అటువంటి పన్నుల పద్ధతిలో వున్న మంచి చెడ్డలను పరిశీలించడం ఈ వ్యాసం వుద్దేశం కాదు. 15 ఎకరాల కమతాలనుంచి ప్రారంభించి క్రమోత్తరాధికంగా రివెన్యూ సర్ఛార్జి విధించి వసూలు చేస్తే వ్యవసాయరంగం మీద వసూలయ్యే మొత్తాన్ని త్వరలోనే రెట్టింపు చేయవచ్చుననని నా అభిప్రాయం.

44. కమతంపై యాజమాన్యం వున్నంతమాత్రాన దాని ఆదాయం అంతా వారికే వెడుతుందని అర్థం కాదు. ముఖ్యంగా, కౌళ్ళకివ్వడం అనేది విశేషంగా వుంది. మొత్తం సాగుభూమిలో 50 84 శాతం భూమి మీద యాజమాన్యంగల 11.9 శాతం వ్యవసాయ జనాభాకు ఆ సంవత్సరం వ్యవసాయంలో వచ్చిన ఆదాయంలో 50 84 శాతం లభించదు ఎగువ స్థాయి వ్యవసాయక తరగతులవారిలో కౌళ్ళకివ్వడం ఈవిధంగా వుందని భూకమతాల నివేదిక తెలుపుతూంది :

పట్టిక 5.

స్వంతభూములు కౌళ్ళకివ్వడం.

| కుటుంబభూమి (ఎకరాలు) | కౌలుకిచ్చిన విస్తీర్ణం (శాతం) |
|---|---|
| 18.75 | 7.40 |
| 24.37 | 8.22 |
| 29.38 | 6.65 |
| 41.13 | 8.23 |
| 88.40 | 7.46 |

45. పదిహేను ఎకరాలకుపైబడిన భూమిగల కుటుంబాల అధీనంలో రమారమి 7.5 శాతం భూమి(మొత్తం భూమిలో) వుందనుకొంటే, 1953-54 లో ఆ కుటుంబాల వారికి తమ భూములలోని పంటలో 20-25 శాతంవరకు మాత్రమే వచ్చివుంటుంది.

46. ఇంక, స్వంతంగా చేసుకొనే భూముల్లోకూడ ఆదాయంలో పాలు పంచుకొనే కూలీలువుంటారు. విస్పష్టమైన లెక్కలులేకపోయినా, స్వంతకమతాలలో పై కూలీలు ఎందరు అవసరం అవుతారో వూహించడం కష్టంకాదు. అటువంటి భూముల ఆదాయంలో 10-15 శాతం కూలిక్రింద పోతుంది.

47. అయితే, 15 ఎకరాల లోపు కమతాలలోకన్న పెద్ద కమతాలలో సాధారణంగా ఎకరంలో ఆదాయం ఎక్కువ వుంటుందని ఒప్పుకోవాలి. కుటుంబకమతం పెద్దదయినకొద్దీ నిర్వహణ ఖర్చులు ఎక్కువ అయినా, ఎక్కువ పెట్టుబడులు పెట్టగలగడం వలన రాబడితేడా ఎక్కువగానే వుంటుంది. బాగా సంపన్నులైన 12 శాతం వ్యవసాయదారుల అధీనంలోవున్న 51 శాతం వ్యావసాయిక భూమిలో వుత్పత్తి మొత్తం వ్యావసాయికోత్పత్తిలో సగంకంటె చాలా ఎక్కువగానే వుంటుం దనడంలో సందేహం అక్కర్లేదు.

48. కౌలుదార్ల వాటాలు, కూలీల ఖర్చులు మొదలయిన వానిని మినహాయించగా, 15 ఎకరాల పైబడిన వివిధ

తరగతులు భూకామందుల ఆదాయం 1953-54 లో వారి వారి భూముల మొత్తాల శాతాలకు సమతూకంశాతం లోనే వచ్చిందని వూహించ వచ్చు ఇది సాహసోపేతమైన అంచనాయే. అయినా సత్యదూరం మాత్రం కాజాలదు. ఈ వూహను ఒప్పుకొంటే 1953-54 లో ఆయా తరగతులవారి ఆదాయాలు ఎల్లా వున్నాయో ఈ పట్టిక వలన తెలుసుకోవచ్చు.

6వ పట్టిక

## పదిహేను ఎకరాల పైబడిన భూమిగలవారిలో ఆదాయాలపంపకం 1953 - '54

| అధీనంలోని భూమి విస్తీర్ణం (ఎకరాలు) | జనాభా (కోట్లు) | మొత్తం ఆదాయం (కోట్ల రూ.) | తలసరి ఆదాయం |
|---|---|---|---|
| 15 ఎ. పైగా | 3. 08 | రూ. 2,644 | రూ. 858 |
| 20 ఎ. పైగా | 2. 13 | రూ. 2,135 | రూ. 1,002 |
| 25 ఎ. పైగా | 1. 63 | రూ. 1,782 | రూ. 1,093 |
| 30 ఎ. పైగా | 1. 22 | రూ. 1,460 | రూ. 1,197 |
| 40 ఎ. పైగా | 0. 80 | రూ. 1,054 | రూ. 1,318 |
| 50 ఎ. పైగా | 0. 62 | రూ. 811 | రూ. 1,308 |
| 75 ఎ. పైగా | 0. 16 | రూ. 453 | రూ. 2,831 |
| 100 ఎ. పైగా | 0. 10 | రూ. 346 | రూ. 3,460 |
| 250 ఎ. పైగా | 0. 008 | రూ. 97 | రూ. 12,125 |
| 500 ఎ. పైగా | 0.0026 | రూ. 32 | రూ. 12,308 |

నోటు : వ్యావసాయిక జనాభా మొత్తానికి 4వ పట్టికలోని సంఖ్యనే తీసుకొన్నాను.

49. 1953 - 54 లో మొత్తం వ్యావసాయిక జనాభా 25 93 కోట్లు వున్నారనుకొంటే వారిలో 3.08 కోట్ల మంది 2644 కోట్లు సంపాదించారు. వీరికి తలసరి ఆదాయం 858 రూపాయలు చొప్పున వచ్చింది. మిగిలిన 22.85కోట్లమందికి 2556కోట్ల రూపాయలుఅంటే తలసరి 112రూపాయలు ఆదాయం వచ్చింది. ఈ తర్వాత ఈ ఆదాయ ప్రమాణాలలో విశేషం మార్పులేమీ లేవు.

50 ఈ అంచనాలన్నీ గమనించేక ఆదాయాలూ, పన్నుల భారాలూ అంటూ మూకఉమ్మడిగా మాట్లాడడం విప్రయోజనం అని గ్రహించవచ్చు; ఆ మొత్తంలోవున్న విడి విడి

భాగాల్ని గమనించడం ముఖ్యం. వ్యవసాయ జనాభాలో తలసరి ఆదాయం 200 రూపాయలు అవడంతో ఆగక ఆ జనంలో కనీసం పదోవంతుమందికి తలసరి మొత్తంలో నాలుగోవంతు కన్న ఎక్కువ ఆదాయంలేదని చెప్పినప్పుడు ఏం చెయ్యాలో తెలుస్తుంది. ఆదాయాలలో ఇంత వారవున్నచోట ఇకముందు వేసే పన్నులు భారం అనిపించరాదు. వ్యవసాయ రంగంనుంచివచ్చే పన్ను రెట్టింపుచేయాలంటే 15 ఎకరాలపైబడిన భూమిగల వారినుంచి వారి ఆదాయంలో నూటికి ఆరేడు శాతం తీసుకొంటేతప్ప 200 కోట్లురాదు. తలసరిని 850 రూపాయలు సరిసగటు ఆదాయంగల ఈ తరహా జనం తమ మిగులునుంచి ఆమాత్రం ఎందుకు చెల్లించరాదు? మిగిలిన ఇతర పద్ధతులు వేనికన్నా ఇది చాల సుకరమైనదికూడా.

51. మన అంచనాలన్నీ గుడికి బారెడుతేడాలోవున్న వే అయినా మనం తేల్చిన నిర్ణయాలను తప్పనిపించేటంత పెద్ద తేడాలేవీ వుండవు. భారతదేశంలోని వ్యావసాయిక జనాభాలో 10 శాతం మంది సంపన్నులంటారు. సాగుభూమిలో సగానికి పైగా వారిది. వాణిజ్యం, పరిశ్రమలు వంటి వానిలో అధికాదాయం వచ్చే వారికన్నా ఎక్కువ తలసరి ఆదాయం గలవారు వారిలో కొందరున్నారు. అయితే దేశంలో కల్లా తక్కువ పన్ను ఇచ్చేదీ వారే. ఈ కొద్దిమందే మొత్తం రివెన్యూలో 80 శాతం చెల్లిస్తున్నారనుకొన్నా అదిభారమేకాదు. వారి ఆదాయంలో అది 5 శాతాన్ని మించదు. వారికన్న 40 శాతం తక్కువ సగటు ఆదాయం గల వ్యవసాయేతర జనాభా అంతకు రెట్టింపు పన్ను చెల్లిస్తున్నారు.

52 మూడో పంచవర్ష ప్రణాళిక ముసాయిదా ప్రకారం ఈ అయిదేళ్ళ లోనూ ప్రభుత్వం 1650 కోట్ల అదనపు పన్నులు వసూలు చేస్తుంది. "ప్రణాళిక విజయం పొందాలంటే ఈ పనిచేసి తీరాలి"—అన్నారు. ఆఖరుకి మూడో ప్రణాళికలో వ్యవసాయపు పన్నుల ఆదాయం రెట్టింపు చేయాలనుకొన్నా అయిదేళ్ళలో 600 కోట్లు వసూలు చేయడం కష్టంకాదు. ఆ మాత్రంజరిగినా ప్రణాళికావసర ధనం లోటు కొంత పూడుతుంది. బాగా ధనం వున్న ఒక తరగతి జనంనుంచి కొంచెం ఎక్కువ సొమ్ము వసూలు చేయకుండా భారతదేశం నిర్లక్ష్యం చేయగల స్థితిలో వుందా? చెయ్యాలనే పట్టుదలవుంటే ఆమాదిరి పన్నుల విధానాన్ని వివరాలతో రూపొందించడం, ధనవంతులయిన రైతులనుంచి వసూలు చేయడం కష్టంకాదు. రాజకీయ స్థాయిలో ముందు నిర్ణయాలు తీసుకోగలిగితే మిగిలింది తర్వాత జరుగుతుంది

(డ్యూక్ యూనివర్సిటీ నిర్వహించిన కామన్‌వెల్త్ స్టడీస్ సెంటర్‌లో ఇచ్చిన ఉపన్యాసం.)

[పెర్స్పెక్టివ్. జూన్-1961]

# భారతదేశంలో మధ్యతరగతి

## సుహృద్ గుప్త

అటు ధనికులూ కాకుండా, ఇటు బీదలూ కాకుండా శరీరకష్టం చేయని వారిని ఏదో మామూలుగా మధ్య తరగతివా రనడం పరిపాటి. అటు ధనికులకూ, ఇటు శ్రామికవర్గానికీ సరిహద్దుగీసి వీరు మధ్యతరగతికి చెందుతారని నిర్ధరించబోయేసరికి బోలెడన్ని చిక్కులు. అదీగాక మరొకటివుంది. సామాజికాభివృద్ధి క్రమంలో వివిధ దశల్లో వేరువేరు జనసందోహాల్ని మధ్యతరగతి అనడం వుంది. ఉదాహరణకు పెట్టుబడిదారీవిధానం ఏర్పడనున్న దశలో అప్పుడే తలఎత్తుతున్న పరిశ్రమల యజమానుల్ని మధ్యతరగతి అనేవారు. వారు పెట్టుబడిదారీ సమాజంలో ఉన్నత తరగతివా రయ్యారు. వివిధ ఉత్పత్తిసాధనాలు అత్యధికంగా వారి అధీనంలో వున్నాయి.

మధ్యతరగతి అనేసరికి మన దృష్టిలో చదువు, వుద్యోగం మొదలైనవి మెదులుతాయి. ఈ తరగతివారికి ఏదో కొంత చదువు వుందనీ శారీరక శ్రమ అవసరంలేని ఏదో ఒక వుద్యోగం వుంటుందనీ, అంత సంపన్నులూ అంత దరిద్రులూకాని స్థితిలో వుంటారనీ మనం భావిస్తాం. అయితే మన నిత్య వ్యవహారాలను ఆలోచించేటప్పుడూ, పనిచేసేటప్పుడూ ఖచ్చితంగా పైభావనలకు కట్టుబడివుండం. వీనిలో ఏ ఒకటి తక్కువైనా, ఒక్కొక్కప్పుడు పై వానిలో ఏ ఒక్కటీ లేనివారిని కూడా అతని కుటుంబం చరిత్రనిపట్టి మధ్యతరగతివాడుగా లెక్కపెట్టేస్తూంటాం.

గతంలో భారతదేశంలో పైకులాల వారు శరీరశ్రమ అవసరంలేని వృత్తులలో వుండేవారు. చదువుకొనేవారు. ఈనాడుకూడా మధ్యతరగతి అనేసరికి మన ఆలోచనల్లో మెదిలేది ఉన్నత కులాలవారే. పై కులంవాడైతేసరి కూలి చేసుకొనేవాడైనా, నిరక్షరుడైనా మధ్యతరగతి అనేస్తాం. ఛటర్జీ అనో, శర్మఅనో, అయ్యంగారనో, నెహ్రూఅనో పేరుండి కూలి చేసుకుంటూ, చదువు సంధ్యలు లేకపోయినా అతని నింకోతరగతికి నెట్టం. అలాగే తక్కువకులాలకు చెందినవారు ఎవరైనా కొద్దిగా చదువుకొని, శరీరశ్రమ అవసరంలేని వుద్యోగం చేస్తున్నా అతనిని మధ్యతరగతివా డనడానికి పైకులాలవారు వప్పుకోరు.

భారతదేశంలో పలుచోట్ల, ముఖ్యంగా గ్రామాలలో, కులం పట్టుదల లింకా జాస్తీగా వున్నాయి. బ్రాహ్మణులూ, మరికొన్ని పైకులాలవారూ నాగలిదున్నరు. చిన్నకమతా

లైనా వ్యవసాయంలో కూలీల నుపయోగిస్తారు. చెప్పులు కుట్టడంలాంటి పనిచెయ్యడానికి వారు సుతరామూ అంగీకరించరు. అసలు వూహించనే లేరు.

అయితే గ్రామల్లోకూడ కుల పట్టింపులు క్రమంగా క్షీణిస్తున్నాయి. పై కులాలవాళ్ళు కొందరు నాగలి పడుతున్నారు. చాలమంది అనేక రకాల సవరణలూ, మినహాయింపులూ చేసుకొంటున్నారు. కొందరు దున్నరు కాని, నూరుస్తారు. దాని వలన ఆచారం చెడదట. కులం అనేదానికి సమాజంలో యింకా ప్రాధాన్యత వుండినా, పారిశ్రామిక కేంద్రాలలో వృత్తులకు సంబంధించినంతవరకు వానికి ప్రాముఖ్యత వుండడంలేదు.

ఇంకా చాల కాలందాకా కులాలూ, వానికి సంబంధించిన భావనలూ వెనకనుంచి బిగపట్టి వుంచుతున్నా, ఆధునిక పరిస్థితులలోకి పరివర్తన పొందుతున్న సమాజంలో వర్గాలను విశదీకరించడానికి అవి తోడ్పడలేవు. వానికి బదులు ఆర్థిక స్థితిగతుల్ని చూడవలసి వుంటుంది. ఉదాహరణకు, ఉత్పత్తి సాధనాలతో వుండే సంబంధాలరీత్యా మధ్యతరగతులను మనం నిర్వచించవలసివుంటుంది. ఉత్పత్తి సాధనాలను కలిగివుండి, ఒకరిని పనికిపెట్టుకోకుండా, తాముగా పనిచేసుకొనేవారిని మధ్యతరగతు లనవచ్చును. ఖచ్చితంగా చెప్పాలంటు, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలో రెండే రెండు వర్గాలు వుండడానికి సాధ్యం. ఒకటి, పెట్టుబడిదారులు. వీరి చేతిలో ఉత్పత్తిసాధనా లుంటాయి. అదనపువిలువను సంపాదించడంకోసం పనివారిని కూలికి పెట్టుకొంటారు; రెండు, కార్మికులు. వీరికి ఉత్పత్తిసాధనాలు ఏవీ వుండవు. బ్రతుకు తెరువుగా తమ శ్రమశక్తిని అమ్ముకొంటారు. ఇక్కడకూడా నిపుణులూ, బాగా జీతాలు ముట్టేవారూ ఒక ప్రత్యేక తరగతిగా వుంటున్నారు. ఆ విషయం గురించి తర్వాత ఆలోచిద్దాం.

ఉత్పత్తి సాధనాల తోడి సంబంధాలనుపట్టి మధ్యతరగతిని నిర్వచించ దలచుకొంటే వారు, పెట్టుబడిదారులకూ కార్మికులకూ మధ్యస్థంగా వుంటారనడానికి వీలులేదు. పెట్టుబడిదారీ వుత్పత్తి సంబంధాలకు బయటనే వుండే తరగతి అది. వారిది మరో రంగం. పెట్టుబడిదారీ విధానానికి పూర్వంనాటి సంబంధాలమధ్య పనిచేసె స్వతంత్రులైన పనివారు. 1951 జనాభా లెక్కల ప్రకారం అయితే వారి సంఖ్య చాల పెద్దది ఆర్థికంగా ఉపయోగించే పనిచేస్తున్న 13.20 కోట్లుమందిలో వారిసంఖ్య 8 2 కోట్లు. అంటే 62 శాతం స్వతంత్రులైన పనివారు. స్థూలంగా చూస్తే వ్యవసాయదార్లలో మూడింట రెండు వంతులమందీ, వ్యవసాయేతర వృత్తుల వారిలో సగంమందీ స్వతంత్రంగా పనిచేసుకొనేవారే.

అయితే స్వతంత్ర వృత్తిచేసుకొంటున్నారు గనక వారందరూ మధ్య

తరగతే ననలేము. ఉదాహరణకు పాలుకు పండించేవాళ్ళూ, బీదస్వంత వ్యవసాయాదార్లూ, వీధుల్లో తిరిగి సరుకులమ్ముకొనేవారూ, బళ్ళులాగే వారు వీరెవ్వరూ మధ్యతరగతి నిర్వచనంలోకి రారు అవిధంగా ఈవర్గాన్ని నిర్వచించేటప్పుడు కేవలం ఆర్థిక విషయాల నేగాక సంస్కారం, ఉద్యోగం, వృత్తి మొదలయినవానిని, ముఖ్యంగా సంస్కారానికి సంబంధించిన వానిని, గమనించవలసి వుంటుంది.

పెట్టుబడిదారీ విధానం విస్తరణతో స్వతంత్రులైన వృత్తిపనులు చేసుకొనే వారు దెబ్బతినేశారు. పోయి శ్రామిక వర్గంతో వారు కలిసిపోయారు. పెట్టుబడిదారీ విధానం బాగా అభివృద్ధి పొందిన అమెరికాలో 1870–1954 మధ్య శ్రమ జీవి ప్రజలలో స్వతంత్ర వృత్తులవారి శాతం 40.4నుంచి13.3కి పడిపోయింది. రెండోవేపున కూలీలూ జీతాలు తీసుకొనేవారి సంఖ్య 59.4 శాతంనుంచి 86.6 శాతానికి పెరిగింది.

సాంస్కృతిక స్థాయినీ, ఉద్యోగ స్థితినీ పట్టి వర్గీకరించబోతే, మధ్యతరగతులలోకి ఈ నాలుగు తరహాల వారూ వస్తారు. (1) సాంకేతిక, విజ్ఞానశాస్త్రవేత్తలయిన పనివారు. (2) గుమాస్తాలూ, తత్సమానులూ. (3) చిన్నవుద్యోగులు. (4) ధనవంతులైన రైతులు, నేర్పరితనం కలిగి స్వతంత్ర వృత్తిచేసుకొనేవారున్నూ. మొదటి రెండుతరహాలవారూ పెట్టుబడిదారులక్రింద పనిచేస్తారు. అందుచేత వారూ శ్రామికవర్గంలో ఒక భాగమే అవుతారు. ప్రభుత్వోద్యోగులూ, వివిధ స్వతంత్ర సంస్థలలో పనిచేసేవారూ తదితర జీతగాళ్ళూ కూడ ఈ తరహాకే చెందుతారు.

దేశంలోని శ్రమజీవి ప్రజానీకంలో ఈ తరహాలకుచెందిన జనం ఏ పరిమితిలో వుంటారనేది చెప్పలేం. వస్తూత్పాదక పరిశ్రమలకు సంబంధించిన లెక్కలప్రకారం పరిశ్రమల్లోని మొత్తం పనివారిలో కార్మికులుకానివారు 1954 లోనూ, 1955 లోనూ 10 శాతం వున్నారు. దేశంలోని అన్ని రంగాలలోనూ పనిచేస్తున్న వారిని తీసుకొంటే వారిలో శారీరక శ్రమచేయని వారూ, నిపుణులైనవారూ పై శాతం కన్నా ఇంకా తక్కువేవుంటారు. మాధ్యమిక, ఉన్నతపాఠశాలల స్థాయి వరకూ చదువుకొన్నవారు 1951 జనాభా లెక్కలప్రకారం దేశంలో 90 లక్షల మందివున్నారు. 15 ఏళ్ళూ, అంతకుపైగానూ వయస్సు వున్న మొత్తం జనంతో పోలిస్తే చదువుకొన్నవారు నాలుగు శాతం వుంటారు. అంటే స్థూలంగా చెప్పాలంటే జనాభాలో మధ్యతరగతులవారు 10శాతం మాత్రం వుంటారు.

మధ్యతరగతి సంఖ్యకయితే తక్కువగానే వుండొచ్చు. కాని వాటికి పలుకుబడి చాల ఎక్కువ. వాళ్ళకి చదువూ, నేర్పూ మాత్ర మే కాదు. నోరుకూడావుంది. అందుచేత శ్రామిక వర్గంయొక్క ఆశయాల యెడలా, సోషలిస్టు వుద్యమం యెడలా పై

నాలుగు తరగతులవారి అభిప్రాయాలేమిటో తెలుసుకోవడం మంచిది.

సాంకేతిక, విజ్ఞానశాస్త్రవేత్తల తరగతికి మేనేజర్లు, ఇంజనీర్లు, కెమిస్టులు, రీసెర్చి పనివారు, సూపర్వైజర్లు, పరిపాలనా నిర్వాహకులు కూడ వస్తారు. వీరిలో బాగావున్న తస్థాయివారు పెట్టుబడిదారులతోనే జమ అయిపోతారు. బాగా పెద్ద ఆదాయాలూ, విశేషాధికారాలూ వారికున్నాయి. సహజంగానే శ్రామికవర్గ దృక్పథానికి వారు వ్యతిరేకం. ఒక్కొక్క మెట్టు దిగివచ్చినకొలదీ పరిస్థితి భిన్నం. వారిలో కూడా మంచి జీతాలు తెచ్చుకునే వారుంటారు. అధికారం, ఉత్సాహం కలిగి మొత్తంమీద తాము చేసేపనియందు అభినివేశం కలిగివుంటారు. సమాజంలో మార్పురావడం అవసరమనేపట్టుదల వారికి లేకపోవచ్చు. అయితే అందరూ ఇల్లాగే వుండరు. వారిలో తెలివిగలవారు కీలకస్థానాలలోవుండి పెట్టుబడిదారీ విధానంలోనూ, వ్యక్తిగత ఆస్తిహక్కులోనూ వున్ననష్టాన్ని గమనించగలుగుతారు. ఆవేశంతో గాక, మేధోపరిశీలనతో వారు సోషలిజమే ఉత్తమవ్యవస్థ అని గ్రహిస్తారు. అలా గ్రహించగలవారు కార్మికవర్గానికి మిత్రులు కాగలుగుతారు.

రెండో తరహా అంతా గుమాస్తాలూ, టీచర్లూ, షాపుగుమాస్తాలూ, ఇతరులైన శరీర శ్రమ అవసరంలేని సాంకేతిక నైపుణ్యం లేని శ్రమజీవులు. వీరి సామాజిక స్థాయిలు భిన్నం కావచ్చు. అయినా క్రమంగా వీరు యజమాని సేవక సంబంధాలప్రత్యక్షానుభవంతో శ్రామిక వర్గంవైపు జారిపోతున్నారు. వీరికిఅట్టే జీతాలుండవు. శరీరశ్రమ చేసేవారికి ఇచ్చేదానికన్న కూడా ఒక్కొక్కపుడు తక్కువగానే వుంటాయికూడా. తమ ఆదాయాల్ని, పని పరిస్థితుల్ని, మానవత్వపు ప్రతిష్ఠను కాపాడుకొనేటందుకై సంఘాలు ఏర్పరచుకోవలసివుంటుందని వీరీమధ్య గుర్తిస్తున్నారు. అనేక సంస్థల్లో కార్మికులు, గుమాస్తాలు ఒకే యూనియనుగా ఏర్పడ్డం జరుగుతూంది. కార్మిక సంఘాల కార్యక్రమాలలో కొందరు గుమాస్తాలు చాల చొరవ తీసుకొని పనిచేస్తున్నారు.

మరొకటికూడావుంది. వారికున్న చదువునుబట్టీ, సామాజిక హెూదానుబట్టీ వీరిలో కొందరు తాము శరీరశ్రమ చేసేవారికన్న ఉన్నతులమనుకొని దూరంగా వుంటున్నారు. కొందరు పారిశ్రామిక తగాదాలలో యజమానుల తరపున నిలబడుతున్నారు కూడా. అయితే ఇప్పుడిప్పుడు చాలమంది మధ్యతరగతి యువకులు శరీరశ్రమ అవసరమయ్యే వుద్యోగాలలోకి పోతున్నారు. అందుచేత ఆ రెండు తరహాల వారి మధ్యనున్న తేడాలు మాసిపోతున్నాయి. కార్మికులూ, గుమాస్తాలూ సుఖమయ జీవిత కోసం సాగించే పోరాటంలో కలిసివుండక పోవడానికి కారణాలు కనిపించవు.

మూడో తరహాకు చెందినవారిలో చిన్న చిన్న యజమానులు, చిన్న

ఫ్యాక్టరీల, వర్క్‌షాపుల, బస్సుల, లారీల, వ్యాపార సంస్థల యజమానులు వున్నారు. పనిలో నియమించే కార్మికుల సంఖ్యనుబట్టి ఈ తరహా వారిని లెక్కగట్టడం వస్తే, భూకామందులలో పెద్దవాళ్ళు చాల మంది ఈ తరగతిలోకి వస్తారు. ఐతే, ఆ భూకామందుల దృక్పథం అభివృద్ధికరమని అనడానికి వీల్లేదు. ఉద్దారుల అధీనంలోనూ, తమ కుటుంబాలలోని యువకుల అధీనంలోనూ పెట్టి కార్మికులచేత పనులు చేయించి వారు వ్యవసాయం సాగిస్తారు. స్వల్పకాలపు కౌళ్ళకిచ్చి మక్తాలు వసూలు చేసుకొంటారు. డబ్బు వడ్డీకి తిప్పుతారు. వ్యాపారంలో లాభాలు గడిస్తారు. బ్రిటిషువాళ్ళ కాలంలో వుండిన పెద్ద పెద్ద దళారులు రద్దయిపోయాక, ఈ తరహా ఆస్తిపరులు బాగా పుంజుకొన్నారు. తమ ప్రయోజనాలకోసం న్యాయమైన వ్యవసాయ సంస్కరణలు జరగకుండా ఆటంకం కలిగిస్తున్నారు.

వ్యవసాయంతో సంబంధం లేని ఇతర చిన్న ఆస్తిపరులకు ఈ సౌకర్యాలు వుండవు. అదేకాక, వారిని పెద్ద పెద్ద పారిశ్రామిక, వ్యాపారిక స్వార్థ ప్రయోజనపరులు నొక్కేస్తూంటారు. యజమానులుగా వారు శ్రామిక వర్గం అంటే వ్యతిరేకత చూపుతారు. అయితే స్వార్థప్రయోజన పరులవలన బాధపడుతున్నవారేగనక ఒక్కొక్కప్పుడు కార్మికులకు మిత్రులుగా కూడ తిరగవచ్చు.

తమంతటు తమ వృత్తులు సాగించుకొనేవారూ, తమతో పనిచేసేటందుకు ఏ కొద్దిమందినో పెట్టుకొనే వారూ నాలుగోతరహా క్రిందకువస్తారు జరుగుబాటుగల వ్యవసాయదారులు కూడ ఈ తరహాలోకేవస్తారు. పెట్టుబడిదారులకూ కార్మికులకూ మధ్యవచ్చే ఘర్షణలలో వీరు ముఖాముఖి పాల్గొవడం వుండదు. అనేక తరహాల అసమానములయిన మార్పిడి పద్ధతుల ద్వారా వీరిని పెద్ద స్వార్థప్రయోజనపరులు పీల్చివేస్తూంటారు. అందుచేత వీరు తమకు కూడా శత్రువే అయిన పెట్టుబడిదారీవర్గంతో పోరాటంలో కార్మికవర్గంతో తరచు కలసి రావచ్చు డబ్బు చిక్కులతో వారు ఎప్పుడూ అస్థిరంగానే వుంటారు. ఏదన్నా మార్పునేటప్పటికి హడలిపోతుంటారు. సహజంగా వెనుకటి ఆచారాలను పట్టుకొని ప్రాకులాడే రకం.

ఈ నాలుగు తరహాలవారిలోనూ పాతదల్లా బంగారమనే దృక్పథం ఉంది. దానికి కారణం వుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ ఏర్పడకపూర్వం సమాజంలో సుస్థిర జీవిత పద్ధతిగల వర్గాలనుంచి వచ్చిన వారే వీరంతా. పెట్టుబడిదారీ విధానం విస్తరించడంతో అదంతా కరిగిపోయింది. నిరంతరాయంగా వారు జారిపోతూనే వున్నారు. అనిశ్చితమూ, అస్థిరమూ అయిన ప్రస్తుతపు బ్రతుకుముందు పూర్వకాలపు స్థితి – ఆనాటి కష్టాలు

గుర్తుండవు కదా – ఎంతో మెరుగు అనిపించడంలో ఆశ్చర్యంలేదు.

అందుచేత గత కాలాన్ని పునర్ని ర్మించాలనే మాటలతో మధ్యతరగ తులు చాలమంది మోసపోవడం జరు గుతూ వుంటుంది. అయితే సమాజం ముందుకు పోతుందేగాని వెనక్కి నడ వదు. పెట్టుబడిదారీ విధానంలో వున్న లోపాలు, కష్టాలూ సోషలిజంలోకి మారడంవలన సర్దుకొంటాయి. పెట్టు బడిదారులతో ముఖాముఖి ఘర్షణ పడ తారు గనక సోషలిజంకోసం సాగే పోరాటంలో కార్మికవర్గం నాయకత్వ పాత్రవహిస్తుంది. పాత కాలాన్ని తలుచుకొని మధ్యతరగతులు పగటి కలలు కంటూవుంటే పెట్టుబడిదారీ విధానాన్ని ప్రతిఘటించవలసిన శక్తులు రెండుగా విభజించబడిపోతాయి.

మధ్యతరగతి వున్న పరిస్థితుల్ని బట్టీ వారి భావనా ధోరణుల్నిబట్టీ వారు ఇంతవరకూ చంచల స్వభావాన్నే కనబరచి వుండొచ్చు. పెట్టుబడిదారీ విధానం వలన నష్టపడుతున్న వీరు అంతకన్న సుఖమయ జీవితంకోసం చూస్తూ వెనక్కి తిరిగారు. సామాజిక వ్యవస్థ ఈ నాడు బాగా విస్తరిస్తూంది. పెట్టుబడిదారీ విధానానికి ప్రత్యా మ్నాయవ్యవస్థ స్పష్టంగాకన్పిస్తూంది. ఈదశలో కొంచెం జాగ్రత్తగా వ్యవ హరిస్తే మధ్య తరగతులు శ్రామిక వర్గానికి బలమైన, స్థిరమైన మిత్రవర్గం కాగలుగుతుంది.

(పెర్‌స్పెక్టివ్: జూన్ 1961)



# గుంటూరు జిల్లాలో బంజరు సాగుదార్ల సమస్యలు



## మండే పిచ్చయ్య



గుంటూరు జిల్లాలోని గ్రామీణులలో సగం మందిదాకా వ్యవసాయ కార్మికులు వుంటారు. ఈ వ్యవసాయ కార్మిక కుటుంబాల్లో ఎకరంలోపు సొంత పొలాలు వున్నవారు బహు తక్కువమంది. మిగతావారు పూర్తిగా వ్యవసాయపు పనులమీద ఆధారపడి జీవించాల్సి వుంది. సంవత్సరంలో వీరికి సగటున నాలుగు మాసాలకన్న ఎక్కువపని దొరకదు. మెట్టప్రాంతాల్లో రూపాయి, కొన్నిసందర్భాల్లో రూపాయిన్నర కూలి వుంటుంది. మాగాణి ప్రాంతాల్లో 2 రూపాయల లోపు కూలి వుంటుంది. పొగాకు తదితర వ్యాపార ధాన్యాలు పండేచోట కూలి సంవత్సరంలో కొన్నిరోజులు కొంత ఎక్కువగానే లభిస్తుంది. మొత్తంమీద పంటలు బాగాపండే ప్రాంతాల్లోకూడ రెండు రూపాయలు కూలి లభించే పనులు అన్ని రోజులలోను లభ్యంకావు.

సంవత్సరంలో పనులు లేని రోజుల్లో అణాలకు బేడ వడ్డీలకు తెచ్చిన అప్పులకు యిల్లు వాకిళ్ళు కొద్దిపాటి సొంతభూమివుంటే అవన్నీ భూస్వాములు అప్పులక్రింద ఆకట్టుకుంటున్నారు. కౌలుభూములు పోవడంతో, చేతివృత్తులు నానాటు దెబ్బతినడంతో సమస్య నానాటు మరింత క్లిష్టంగా తయారవుతున్నది.

గ్రామసీమల్లో నిరుద్యోగాన్ని పారద్రోలి తిండి, బట్ట, యింటి సమస్యను పరిష్కరించాలంటే భూసంస్కరణలు అమలు జరిపి, దున్నేవానికి భూమి లభించే విధంగా భూసంబంధాల్లో మార్పు తెచ్చిననాడే సాధ్యమని దేశంలోని అన్నిముఖ్యరాజకీయ పార్టీలు సిద్ధాంతరీత్యా అంగీకరించిన విషయం. ప్రదేశ్ ప్రభుత్వం అంగీకరించిన భూసంస్కరణల చట్టంవలన భూమి కలిగిన వారిది ఒక సెంటు కూడా పోదనీ, లేనివానికి ఏమాత్రం భూమి రాదనీ తేలిపోయింది. మన ప్రక్కనే పదిహేడువేల ఎకరాలు సొంతభూములు గలిగిన చల్లపల్లి రాజ దగ్గర పంచడానికి భూములు లేని విధంగా భూసంస్కరణల చట్టం తయారయిందంటే, ఇక ఆచట్టం ఎంత

హాస్యాస్పదంగా వుందో వేరే చెప్ప నవసరం లేదు. పోతే లక్షల ఎకరాలో వున్న బంజరు సమస్య యెడల ప్రభుత్వ మవలంబించే వైఖరినికూడా పరిశీలిద్దాం.

గుంటూరు జిల్లాలో పట్టాలివ్వడానికి ఎలాంటి అభ్యంతరం లేని శిస్తు కట్టిన బంజర్లు ఒక లక్ష యకరాలు; వాగు, చెరువు, డొంక, సాల్టు పోరంబోకులు 20,000 ఎకరాలు; రిజర్వు పారెస్టు భూములు రెండు లక్షల ఎకరాలలోపు—మొత్తం జిల్లాలో మూడులక్షలకు తగ్గకుండా బీదలకు పంచడానికి బంజరు భూములున్నాయి. ఇప్పుడు సాగులో వున్న లక్ష యకరాలు గాక మరో రెండులక్షల యకరాలు పేదలకు పంచి కొంత ఆర్థిక సహాయంచేస్తే త్వరలో సాగులోకి తీసుకరావచ్చు ఈ భూములు జిల్లాలోని వ్యవసాయ కార్మికుల్లో సగం మందికి పైగా ఒక ఎకరానికి పైగా పంచవచ్చు. ఈ బంజర్ల పంపకం వలన పేదల ఆర్థిక, సాంఘిక జీవిత పరిస్థితుల్ని కొంత మెరుగు పరచవచ్చు. కొన్నివేల బస్తాలు ఆహారధాన్యాలు అదనంగా పండించవచ్చు. పస్తులు, అర్థాకలితో బాధపడేవారికి తిండి పెట్టవచ్చు. ఈ భూములకు నీటివనరులు కలిగి సాగులోకి వచ్చిననాడు జిల్లా ఆర్థిక పరిస్థితులుకూడ బలపడతాయి.

ఇంత ప్రాధాన్యత గలిగిన యీ బంజరు భూముల విషయంలో ప్రభుత్వ అచరణ, పేదలకు భూముల్ని పంచడానికి వ్యతిరేకంగావుంది. భూములకు పట్టాలివ్వకుండానే వేల సంఖ్యలో శిస్తులు, పెనాల్టీలు పేదలపై విధించి, తన బొక్కసాన్ని నింపుకుంటూంది. అదేసమయంలో బంజరు భూముల పంపకానికని అదనంగా వేసిన రెవిన్యూ సిబ్బందిని రాజకీయ బాధితులకు పొలాలు పంచిపెట్టడానికి వినియోగించారు. ఆక్రమణదారులను తొలగించడానికి, దొంగ రికార్డులు సృష్టించడానికి యీ సిబ్బంది ఉపయోగపడింది. కొన్ని ప్రాంతాల్లో పోలీసుల్నికూడ ఉపయోగించి సాగుదార్లను తొలగించారు. జిల్లాలో మొత్తం పన్నెండువేల ఎకరాలదాకా రాజకీయ బాధితులకు కట్టబెట్టారు. గ్రామోద్యోగుల, రెవిన్యూ అధికారుల లంచగొండితనానికి అంతు పంతు లేకుండా వుంది. ఒక ఎకరాకు 'బి' ఫారం వ్రాయించుకోవాలంటే, పది రూపాయలు లంచం యిచ్చుకోవాలి. ఇవ్వకని ఎదురు తిరిగితే, గ్రామ కరణం తన చెప్పుచేతల్లో వుండే మరొకనిపేర 'బి' ఫారం వ్రాసి కక్ష సాధిస్తాడు. రెవిన్యూ అధికారులకు బంజరుభూముల సమస్య లంచాల రూపంలో ధనార్జన చేయడానికి లాభసాటి వ్యాపారంగా తయారయింది.

## భూస్వాముల ఆక్రమణలోనున్న బంజర్లు

ప్రతి గ్రామంలోను ప్రభుత్వ బంజర్లను భూస్వాములు ఆక్రమించుకొని అనుభవిస్తున్నారు. కొన్ని

గ్రామాల్లో వందల సంఖ్యలో కూడ ఈ బంజర్లు భూస్వాముల చేతిలో వున్నాయి. 2 ½ ఎకరాల మాగాణి, 5 ఎకరాల మెట్ట వున్న రైతుచేతిలో బంజరు వుంటే, అలాంటివారిని భూములనుండి ఖాళీ చేయించాలని ప్రభుత్వ ఉత్తరువు ఉంది. జిల్లాలో భూస్వాముల చేతుల్లో 15 వేల ఎకరాలదాకా సారవంతమైన బంజర్లు వున్నాయి. వీళ్ళను భూములనుండి తొలగించి, ఆభూములు పేదలకు పంచడానికి ప్రభుత్వానికి దమ్ములులేకుండా వున్నాయి. బంజరు భూములనుండి భూస్వాముల్ని తొలగించి, ఆ భూములను పేదల కివ్వాలని అనేక విజ్ఞప్తులు ప్రభుత్వానికి చేసినప్పటికీ ప్రయోజనం లేకపోవడంతో పేదలు తమంతట తాము భూస్వాముల భూములను ఆక్రమించుకున్న ఘటనలు కూడ వున్నాయి ఒంగోలు తాలూకా గడియపూడి గ్రామంలో భూస్వాముల చేతిలోవున్న 40 ఎ.వ్యవసాయ కార్మికులకు యిప్పించాలని నాలుగు సంవత్సరాలు రెవిన్యూ అధికారుల చుట్టూ తిరిగారు.ఏసంవత్సరానికాసంవత్సరం కాళ్లుఅరిగిపోవడం,లంచాలరూపంలో డబ్బు ఖర్చుకావడం తప్ప ప్రయోజనం కనబడలేదు వ్యవసాయ కార్మిక సఘం అండతో పేదలంతా వెళ్ళి ఆ భూస్వాములక్రింద నున్న భూముల్ని ఆక్రమించుకున్నారు భూములు దున్నుతుంటే వ్యవసాయ కార్మికుల్ని కొట్టాలని చేసిన ప్రయత్నాలు పేదల ఐక్యవుద్యమం ముందు సాగలేదు. చివరకు పేదలు ఆ భూముల్ని దక్కించుకొని సేద్యంచేసి అనుభవిస్తున్నారు ఒంగోలు తాలూకా చీమకుర్తిలో వంద ఎకరాలకు పైబడ్డ భూస్వాముల చేతిలో 800 ఎకరాల బంజరు వుంది. ఈ గ్రామకరణం అధీనంలోవున్న బంజరును సబ్ కలెక్టరు విడగొట్టి పేదలకు యిచ్చాడు. ఆ భూమిసాగుచేసి పైరు వేస్తే కరణం రౌడీలచేత గొడ్లనుతోలి మేపించి, మిగలిన పైరు పీకివేయించాడు ఆభూమి పేదలకు దక్కకుండా నేటికీ కోర్టులచుట్టూ త్రిప్పుతున్నారు. సమయం దొరికినపుడు దౌర్జన్యంగా వ్యవహరించడానికి వెనకాడడంలేదు. ఈ పరిస్థితుల్లో భూస్వాముల చేతుల్లో వున్న భూమిని ప్రభుత్వమే వారిచేత ఖాళీచేయించి పేదలకు పంచడమనేది ప్రభుత్వానికి తలకుమించినపని. పేదలచేతుల్లోకి భూములు వస్తే భూస్వాముల ప్రాబల్యం పలుకుబడిపోతుందని ప్రభుత్వం జంకుతుంది. పేదలచేతుల్లో భూములుంటే వాళ్ళ వడ్డీ వ్యాపారానికీ, నాము వ్యాపారాలకూ తీరనినష్టం కలుగుతుంది. అందువలన ఈ భూస్వాముల అధీనంలోవున్న బంజరు భూములు పేదల చేతిక్రిందికి రావడానికై పేదల శ్రేయస్సుకోరే ప్రజాస్వామికవాదులంతా కలిసి కృషిచేయాలి. విజ్ఞప్తులతో భూస్వాములు లొంగిరాకపోతే వాళ్ళ అధీనంలోనున్న బంజర్లు పేదలకు దక్కే విధంగా వుద్యమాన్ని నిర్మించాలి. పేదలకు బలంవున్న గ్రామాల్లో వెంటనే భూస్వాముల చేతిలోనున్న

బంజర్లు స్వాధీనంచేసికొని సాగుచేయా ల్సిన అవసరంవుంది. ఈలాంటి సందర్భాల్లో ప్రభుత్వం పేదలపక్షంవహించేటట్లు తీవ్రమైన ఆందోళన చేయాలి. ఇదొక తక్షణకర్తవ్యంగా గుర్తించకపోతే, భూస్వాములు ఆ బంజర్లను ఎకరం వెయ్యి రెండువేల రూపాయల దాకా కొద్దిపాటి అర్థికస్తోమతుగలిగిన వారికి అమ్మివేసుకుంటారు. తెలివిగల భూస్వాములు యిప్పటికే కొన్నిచోట్ల బంజర్లు అమ్ముతున్నారు.

## కృష్ణా బ్యారేజి భూములు

ఈ బ్యారేజి క్రింద కృష్ణా గుంటూరు జిల్లాల్లో 20 వేల ఎకరాల బంజరు భూములున్నాయి. వీటిలో అధికభాగం హరిజన క్రైస్తవులు తదితర వెనుకబడిన కులాలవారిక్రింద వున్నాయి. ముప్ఫయి సంవత్సరాల నుండి పేదలు ఎన్నో కష్టాలుపడి సాగులోగి తెచ్చి ఎకరాకు పదినుండి పదిహేను బస్తాలదాకా ధాన్యం పండిస్తున్నారు. కొన్ని గ్రామాల్లో మూడు వందల ఎకరాలుంటే ఆ భూముల్లో 200 ఎకరాలదాకా రాజకీయ బాధితులకు సాగుదార్లను తొలగించి పట్టాలిచ్చారు. ఇక మిగిలిన భూముల్ని వేలంలో భూస్వాములకు అమ్మివేస్తామని మే నెలలో ఆంధ్ర మంత్రివర్గం చేసిన నిర్ణయం సాగుదార్లలో ఆగ్రహావేశాలు కలుగజేసింది. ఈ భూముల్లో సాగుదార్లను తొలగించి వేలం వేస్తే వారి అర్థిక పరిస్థితులు పూర్తిగా తారుమారవుతాయి. రేపల్లె తాలూకా సముద్రప్రాంతపు గ్రామాల్లోని పేదలు గ్రామాలు వదలి వలసలు వెళ్లడం తప్ప మరోగత్యంతరంలేదు. అందుకనే గుంటూరు జిల్లా కమ్యూనిస్టు సమితి కార్యవర్గం సకాలంలో "మంత్రివర్గ నిర్ణయాన్ని ధిక్కరించి కృష్ణా బ్యారేజి క్రింద బంజరు భూముల్ని కాపాడుకోడానికి సిద్ధంకండని" పిలుపుయిచ్చింది. తాలూకా, బ్లాకు స్థాయిల్లో వందలు వేల సంఖ్యలో కృష్ణా బ్యారేజిక్రిందవున్న బంజరు సాగుదార్లను సమీకరించి పెద్ద ఉద్యమాన్ని నిర్మించింది. సాగుదార్లలో కదలిక వచ్చింది. జిల్లాలోను, రాష్ట్రంలోని యితర ప్రాంతాల్లోను జరిగిన ఆందోళన ఫలితంగా సాగుదార్లను తొలగించి భూముల్ని వేలం వేయబోమని రెవిన్యూ మంత్రి ప్రకటించాల్సి వచ్చింది. అయితే ఈ ఉద్యమాన్ని కొనసాగించి, మే నెలలో చేసిన వుత్తర్వును రద్దుచేయించి, సాగుదార్లకు పట్టాలకొసరం కృషి చేయాల్సి వుంది. 250 ఎ. పైబడ్డ చోట్ల నెలకొల్పా లనుకుంటున్న సహకార వ్యవసాయ క్షేత్రాల్లో పాత సాగుదార్లకు ప్రాతినిధ్యం వుండేలా చూడాల్సి వుంది.

## ఫారెస్టు బంజర్లు

సత్తెనపల్లి తాలూకా వెంగళాయిపాలెం ఫారెస్టు రేంజిలో ఇరవైవేల ఎకరాలు, వినుకొండ తాలూకాలో మరొక 50 వేల ఎకరాలు, అలాగే పల్నాడు తాలూకా తుమ్మగుంట,

మాదెనపూడి, తుమృగోడులో వందల ఎకరాలు, గుంటూరు, నర్సరావుపేట తాలూకాల్లోనూ మొత్తం జిల్లాలో దండిగా ఆహార ధాన్యాలు పండించ డానికి తగిన భూములున్నాయి.

సత్తెనపల్లి తాలూకా కామేపల్లి పంచాయతీ ఫారెస్టుల క్రిందనున్న రెండువేల ఎకరాలభూమిని మూడు వందల కుటుంబాలవారు చుట్టుపట్ల ఏడెనిమిది గ్రామాలకు చెందినపేదలు సాగుచేసి సజ్జ, కొర్ర, జొన్న, ప్రత్తి మొదలయిన ఆహారధాన్యాలు పండించి అనుభవించేవారు. ఐదు సంవత్సరాలు సాగుచేసిన అనంతరం ప్రభుత్వం సాగుదార్లను తొలగించి, ఆభూముల్లో అడవులు పెంచాలనే నెపంతో రిజర్వు ఫారెస్టులో కలిపింది. చెట్లు పెంచ డానికి చాలా డబ్బు వెచ్చించింది. కాని చెట్లు బ్రతకలేదు. పెట్టిన పెట్టు బడి అంతా వృధా అయిపోయింది ఈ భూముల్ని దక్కించు కోడానికి 1954 సం॥లో జిల్లాలో జరిగిన బంజరు సత్యాగ్రహంలో పొలాల మీద సాగుదార్లు సత్యాగ్రహంచేసి అరెస్టు అయినారు. అనుభవంలో అడవిచెట్లు పెరగవని తెలిసికూడా ఆ భూముల్ని పాతసాగుదార్లకు యివ్వ కుండా ప్రభుత్వం ఆటంకాలు పెడు తోంది. కొన్నాళ్ళు కుమిరిపద్ధతిపైసాగు కిస్తానని చెప్పి యెగగొట్టింది. చుట్టు పట్ల పేదలు ఒకసొసైటీని స్థాపించు కొని ఆ సొసైటీక్రింద ఆ రెండువేల ఎకరాలు సాగుకు యివ్వమని ప్రస్తుతం ఆందోళన చేస్తున్నారు గుంటూరు తాలూకా నిడుముక్కల, ఎండ్రాయి ప్రాంతాల్లో 500 ఎకరాలు పంచా యతీ అడవి భూములు సాగుచేస్తే, సాగుదార్లను తొలగించి రిజర్వులో కలిపారు. వినుకొండ తాలూకా భద్రునిపాలెం ప్రాంతంలో 800 యకరాలనుండి నర్సారావుపేట తాలూకా కొప్పరం ప్రాంతంలో 600 ఎకరాలనుండి కుమిరి పద్ధతిపై సాగు చేస్తుండే సాగుదార్లను తొల గించి, ఆ భూముల్ని రిజర్వు ఫారె స్టులో కలిపారు. రిజర్వు ఫారెస్టు వుద్యోగస్తుల ఆగడాలకు కొన్ని ప్రాంతాల్లో మరీఅంతులేకుండావుంది. ఆ ఫారెస్టు భూముల్లో యిండ్లు వేసు కుంటేను, భూముల్లోకి గొడ్లుపోతేను కేసులు పెట్టడం, కోర్టులకీడ్చి పెనా ల్టీలు వేయడం సర్వసాధారణ విషయ మయింది. కామేపల్లి రిజర్వుభూముల అనుభవం చూచినతరువాత చెట్లుపుట్ట, కనీసం గడ్డికూడ మొలవని వేలాది ఎకరాలు రిజర్వు ఫారెస్టుక్రింద నమోదు చేశారు. అడవుల పెంప కానికి ఏభూములు పనికివస్తాయో సరయిన పునఃపరిశీలన జరిపి, మిగతా భూములు ఆహార ధాన్యాలు పండించ డానికి పేదలకు యివ్వాలి. నల్లమల మొదలైన కొన్ని అడవుల్లో భూస్వా ములు, కాంట్రాక్టర్సు బయలుదేరి దట్టమైన అరణ్యాల్లో చెట్లు నరికివేసి వాటిని కలప, బొగ్గుక్రింద మార్చి వేల రూపాయలు ధనార్జన చేస్తుంటే, వారిని అదుపుచేసి వాస్తవంగా వుప యోగమైన ఆ అరణ్యాలు ప్రభుత్వం

రక్షించలేక పోతుంది. పేదలు బ్రతకడానికి సేద్యంచేసుకుంటున్నభూముల్లో నుండి తొలగించి, వాటిలో అరణ్యాలు పెంచుతామని చెప్పడంలో అర్థంగోచరించడంలేదు. రిజర్వు ఫారెస్టుల క్రింద నిషేధించబడ్డ భూముల్లో తక్షణమే కొమిరిపద్ధతిపైన సాగుకు యివ్వడం ఉపయోగమైనదని ప్రభుత్వం గుర్తించేలా చేయాలి.

రేపల్లె, బాపట్ల, ఒంగోలుతాలూకాల్లో సముద్ర ప్రాంతాల్లో ప్రభుత్వము బంజర్లు మోతుబరులకు అతి స్వల్పరేటుకు ఏండ్ల తరబడి లీజుకిచ్చారు. భూస్వాములు ఈ భూముల్లోని సరుగుడు మొదలైన చెట్లుపెంచి యిప్పటికే కొన్ని వేల రూపాయలు ధనార్జన చేశారు. భూస్వాముల లీజు అయిపోయినచోట, ఆ భూముల్ని పేదలు సాగుకు యివ్వమని ప్రభుత్వానికి అర్జీలు పెట్టుకుంటే, వాటిని నిరాకరించి ఆ భూముల్ని రిజర్వు ఫారెస్టులో కలిపి పేదలు జొరబడకుండ నిషేధాజ్ఞలు జారీ చేశారు. ఒంగోలుతాలూకా కనపర్తి దగ్గర ద్రాక్షారపు చంద్రమౌళికి పదకొండు వేల ఎకరాలు బంజర్లు 33 సంవత్సరాలకు లీజు కిచ్చారు. లీజు షరతులు వుల్లంఘించి ప్రభుత్వానికి పతిహేను వేల రూపాయిలు శిస్తు కట్టకుండా వుంటే ఆ లీజు రద్దు చేయబడింది. చుట్టుపట్ల గ్రామాల్లోని పేదలు ఆ భూములు తమకు సాగుకు యివ్వాలని ఆందోళన చేశారు. ప్రయోజనం శూన్యం. ప్రభుత్వం తిరిగి ఆ లీజును పునరుద్ధరించి చంద్రమౌళికే ఆ భూములు యిచ్చారు. ఆ భూముల్ని చంద్రమౌళి పేదలకు అమ్ముకుంటున్నాడు.

వేల సంఖ్యలోనున్న యీ రిజర్వు ఫారెస్టు భూములలో పేదలు సాగు చేయకూడదనివున్న ఉత్తరువులు రద్దు పరచబడే విధంగా తీవ్రమైన ఆందోళనా, పోరాటాలు నడపాలి ప్రతి సంవత్సరం ఆహారధాన్యాలకు కోట్ల రూపాయలు విదేశాల్లో ఖర్చు పెడుతున్న విషయం దేశభక్తులందరి దృష్టికి తెచ్చి, ఈ భూముల్ని సాగులోకి తేవడానికి ప్రజాస్వామికవాదులందరూ పేదలకు నాయకత్వం వహించి, ఆ భూములు పేదలకు దక్కేవరకు విశ్రమించకూడదు. వేల సంఖ్యలో కౌలుపేరుతో భూస్వాముల చేతుల్లో వున్న బంజరుభూముల లీజును రద్దుచేసి, అవి పేదలకు ఇవ్వాలని పోరాడునట్లు చేయాలి.

## చెరువు పోరంబోకులు

మెట్ట ప్రాంతాల్లో ఎక్కువ గ్రామాల్లో 25 ఎకరాలనుండి 800 ఎకరాలదాకా చెరువు పోరంబోకు లున్నాయి మంచినీరు మొదలయిన గ్రామ వుమ్మడి అవసరాలకు తప్పని సరియైన చెరువులు మినహా, మిగతా వాటిని రెవిన్యూ బంజర్లుగా మార్చమని ప్రభుత్వ ఉత్తరువు లున్నాయి. రెవిన్యూ అధికారులు ప్రభుత్వ ఆర్డరును అమలుజరపకుండా, సాగుదార్లపై విపరీతమైన పెనాల్టీలు విధించడం,

సాగుదార్లను భూములనుండి వెళ్ళ గొట్టడం జరుగుతోంది. ఎక్కువ గ్రామాల్లో ఈ చెరువు పోరంబోకులు భూస్వాములు ఆక్రమించుకొని, పేదలను జొరబడకుండ దౌర్జన్యంగా వ్యవహరిస్తున్నారు. ఒంగోలు తాలూకా చివకుర్తిలో వందల ఎకరాలు చెరువుపోరంబోకులు భూస్వాములు అనుభవిస్తున్నారు. దైవల రావూరు చెరువుభూముల్లోకి పేదలను రానివ్వడం లేదు. ఇటీవలికాలంలో రాజకీయ బాధితులదృష్టి చెరువుపోరంబోకులమీద పడింది నర్సరావుపేట తాలూకా పసుమర్రు గ్రామంలో పేదల సాగులోవున్న చెరువుపోరంబోకు ఆర్థికమంత్రి బ్రహ్మానందరెడ్డి గారికి రాజకీయబాధితుడుగా పట్టా ఇచ్చారు. మంత్రిగా ప్రభుత్వ ఖజానా నుండి పెద్ద మొత్తంలో జీతాలుపుచ్చుకుంటూ, భక్తులు యిచ్చే నజరానాలతో సంతృప్తి పడకుండా పేదల పొట్టగొట్టే యీ కార్యక్రమం ఏ రాజకీయ బాధితునికి తగనిపని అందులో ముఖ్యంగా వున్నతపదవిలోనున్న బ్రహ్మానందరెడ్డి, అల్లూరి సంజీవరెడ్డి గార్లవంటివారికి సిగ్గుమాలినపని. కంచెయే చేనుమేసిన తీరుతప్ప వేరే కాదు యిది.

గుంటూరు తాలూకా తుళ్ళూరు గ్రామంలో 130 ఎకరాల భూమి పదిహేను సంవత్సరాలనుండి మూడు వందల కుటుంబాలు సాగుచేస్తున్నాయి. ఈ చెరువు పోరంబోకులో వున్న చెట్లు నగకడానికి, మెట్టు పల్లాలు సరిచేయడానికి ఎకరాకు వెయ్యి రూపాయిలు వెచ్చించి పంట భూములుగా మార్చారు. అనుభవించడానికి నోటిదగ్గరకు వచ్చిన యీ పంట భూముల్లో 60 ఎకరాలు రాజకీయ బాధితుల కిచ్చారు. చీరాల ప్రాంతంలో సాగుదార్లకిచ్చిన పట్టాలను రద్దుచేసి, ఆ భూముల్ని రాజకీయ బాధితులకిచ్చారు ఏమిటీ అన్యాయమని అడిగితే, భూములు పోగొట్టుకున్న వారికి ప్రత్యామ్నాయ భూము లిస్తానంటారు. ఇవే భూములు రాజకీయ బాధితుల కెందుకీయకూడదో అర్థం కాని విషయం సత్తెనపల్లి తాలూకా రాయుడుపాలెంలో మూడువందల ఎకరాలు రిజర్వు ఫారెస్టు రాజకీయ బాధితులకిచ్చారు. ఆ భూముల్లోవున్న చెట్లు అడవికంపచూచి మన దేశభక్తులు బెదిరిపోయి, ఆ భూములు తీసుకోడానికి నిరాకరించారు. చుట్టుప్రక్కల గ్రామాలలోని పేదలు ఆ భూముల్లో ఎంతో శ్రమశక్తిని, డబ్బును వెచ్చించి సాగులోకి తెచ్చారు. కనీసమైన సిగ్గు లజ్జకూడ లేకుండ, ఆభూములు తమకు కావాలంటూ మొదట్లో పారిపోయిన రాజకీయ బాధితులు అడిగితే, ప్రభుత్వం సాగుదార్లను తొలగించి, వారికి పట్టాలిచ్చింది.

రాజకీయ బాధితులకు యిచ్చిన పొలాల్లో నిలబడి సాగుచేసిన వారు బహుకొద్దిమంది మాత్రమే భూములకు పట్టాలిచ్చిన వెంటనే ఆ భూముల్ని అమ్ముకుపోవడం ప్రతి చోటా జరుగుతున్న విషయం. అందు

వలన ప్రభుత్వం రాజకీయబాధితులకు పొలాలు మంజూరుచేసేకన్న, ధన రూపంలో సహాయంచేయడంమంచిది. రాజకీయబాధితుల జాబితా రోజు రోజుకు పెరుగుతూందేగాని, తరగడం లేదు. ఒకానొక గ్రామంలో అధికార పార్టీకి సహాయం అవసరమైతే, ఎలాంటి నైతిక ప్రమాణాలు పాటించ కుండా, రాజకీయ బాధితుడని సర్టి ఫికెట్టు యిచ్చి, ఏవైనా పేదల భూము లుంటే చూసుకో, పట్టా లిస్తామనే ఘనులు ఈనాడు కాంగ్రెసు పార్టీలో లేకపోలేదు.

వాగు, డొంక, కుంట, కొండ పోరంబోకుల్లో పేదలు ప్రవేశించ రాదన్న నిషేధం తొలగించితే మరి కొన్ని వేలఎకరాలు సాగులోకి తీసుక రావచ్చు. నాగార్జునప్రాజెక్టు విషయం మన పాలకుల బుర్రల్లోలేసినాటినుండి, ఆ ప్రాంతాల్లోని బంజర్లు పేదలు ఆక్రమించుకొని సాగుచేస్తున్నారు. నాగార్జున సాగర్ ప్రాజెక్టు పేరుతో ఆ బంజరు భూములపై నిషేధం విధిం చారు. ప్రాజెక్టు పని పూర్తి అయిన తరువాత, ఈ భూములు వేలంపాటలో భూస్వాములకు అమ్మి డబ్బు సంపా దించాలనే వ్యాపార మనస్తత్వం ప్రబలంగా కనిపిస్తోంది. అందువలన సర్వే అయిపోయి రాళ్లు నాటడం పూర్తి అయిపోయిన కాలువల క్రింది బంజర్లకు పట్టాలివ్వాలనీ, సర్వేకాని కాల్వల క్రింద భూములకు తాత్కా లిక పట్టాలివ్వాలనీ ఆందోళనచేయాలి.

ఏభయి సంవత్సరాలుగా హరిజన క్రైస్తవులు ఫీల్డు లేబరు కో-ఆపరేటివ్ సొసైటీల క్రింద సాగుచేస్తున్న కృష్ణ లంక భూములు కళా వెంకటరావు, చంద్రమౌళిగార్లు పేదలకు దక్క కుండా భూస్వాములకు కట్టబెట్టడానికి చేసిన ప్రయత్నాలు సాగుదార్ల ఐక్య వుద్యమం ముందర సాగలేదు. వందల ఎకరాలు పైబడ్డ లంకభూముల్లో ఏవో కుంటి సాకులుచూపి మూడో వంతు వేలంలోకి తెచ్చి కొన్ని వందల ఎకరాలు భూస్వాములపరం చేశారు ఈ మూడోవంతు వేలం రద్దు అయ్యే టట్లు, సాగుదార్లందరికి పట్టాలువచ్చే టట్లు ఆందోళన చేయాల్సివుంది.

ఆంధ్రదేశంలో పరిశ్రమలు వృద్ధి కాకపోవడంతో గృహ పరిశ్రమలకు తగిన ప్రోత్సాహం లేకపోవడంతో యిటీవల గ్రామాలలోనే జనాభా కేంద్రీకరణ ఎక్కువవుతోంది. ప్రతి వారిదృష్టి భూమిపై బడడంతో పొలా లకు విపరీతంగా ధరలు పెరిగి పోయాయి. సాగుభూములపై ఒత్తిడి నానాటు అధిక మవుతోంది. చేతి వృత్తులు దెబ్బతినడంతో గౌడ కార్మి కులు, చేనేత కార్మికుల్లో కొంత భాగం కూలిపనులకు ఎగబడడంతో చాలచోట్ల పనిరోజులు తగ్గిపోతు న్నాయి కూలిరేట్లు తగ్గించడానికి భూస్వాములకు యిదొక చక్కటి మార్గంగాకూడ వుంది. ధనిక రైతు లకు, భూస్వాములకు వ్యవసాయం బాగా లాభసాటి వృత్తిగ తయారవ డంతో, చవిటి పర్రలు, బంజర్లు కూడ

ఆకట్టుకోవాలని తాపత్రయ పడుతున్నారు. ఫ్యూడల్ భూస్వామిక వర్గాల లాభాలు పోతాయని బంజరు పంపకాన్ని, భూసంస్కరణల్ని నేటి ప్రభుత్వం అమలు జరపకుండా మోసపు మాటలు చెపుతోంది. జాతీయ ప్రయోజనాలను దెబ్బతీసే వీరి చర్యలను దేశంలోని కష్టజీవులు, దేశభక్తియుత ప్రజానీకం గుర్తించేలా వుద్యమాన్ని నిర్మించి, వారిని ప్రజలనుండి వేరుచేయాలి.

పైన వుదహరించిన పలురకాల బంజరుభూముల సమస్య పరిష్కరించి, వాటికి వెంటనే సాగుదార్లకు పట్టాలివ్వాలని జిల్లా వ్యవసాయ కార్మిక సంఘం, జిల్లా కమ్యూనిస్టు పార్టీల సంయుక్త ఆధ్వర్యాన మే, జూన్, జూలై మూడు మాసాలుగ అన్ని తాలూకాల్లో తీవ్రమైన ఆందోళన జరిగింది. వేలసంఖ్యలో సాగుదార్లను సమీకరించి బంజర్ల పంపకం జరుపమని తీర్మానాలు, విజ్ఞప్తులు ప్రభుత్వానికి చేశారు. ఈ కాలంలోనే రేపల్లె, బాపట్ల, ఒంగోలు, నర్సరావుపేట, వినుకొండ, పల్నాడు తాలూకాల్లో బంజరు సభలు జరిపి, ఎనిమిది వేల సాగుదార్లకు పట్టాలివ్వాలని పిటీషన్సు పెట్టించి, వేల సంఖ్యలో సాగుదార్లను రెవిన్యూ అధికారులవద్దకు రాయబారాలు వెళ్ళి, సాగుదార్లను ఎదుర్కొంటున్న ఇబ్బందులు వివరించి వాటి పరిష్కారానికి కృషి చేయమని విజ్ఞప్తి చేయడం జరిగింది. ఆగస్టు 1 వ తేదీన జిల్లా బంజరు మహాసభ పదిహేనువందలమందితో జరిపి, జిల్లాలోని బంజరు సాగుదార్ల సమస్యలపై దీర్ఘమైన మెమోరాండం జిల్లా కలెక్టరుకు సమర్పించాము. సాగుదార్లూ, ప్రజాసంఘాలూ చేసిన విజ్ఞప్తులను ప్రభుత్వం పరిశీలించి, ఈ సమస్యను వెంటనే పరిష్కరిస్తుందని ఆశిద్దాం.

కాని, ప్రభుత్వ ఆచరణ విజ్ఞప్తులతోను, వినతిపత్రాలతోను ప్రజల సమస్యలను పరిష్కరించే చురుకుదనము, విజ్ఞత కోల్పోయినట్లు కనబడుతుంది.

సంజీవయ్యగారు ముఖ్యమంత్రి కాగానే, ఉగాదిలోపుగా బంజర్లకు పట్టాలిస్తానని వాగ్దానం చేశారు. ఉగాది వెళ్ళి చాలాకాలమైనప్పటికీ, బంజరు సాగుదార్లకు పట్టాలివ్వడానికి బదులు, సాగుదార్ల భూములు లాగి, రాజకీయ బాధితులకు పట్టాలిప్పించగలిగారు. ఇటీవల సంజీవయ్యగారు చీరాలలో రెండువందలమంది బంజరు సాగుదార్లకు పట్టాలిచ్చారని పత్రికలన్నీ ఫోటోలతో సహా ప్రముఖంగా ప్రకటించాయి. వాస్తవానికి, ఒక్కొక్క సాగుదారుడు రెవిన్యూ అధికారులకు, దళారీలకు ఒక పట్టాకు రెండువందల రూపాయలు లంచ మిచ్చుకోవలసి వచ్చింది. పీడితప్రజల ప్రతినిధిగా పోజుపెట్టి ఉపన్యాసాలు దంచేసి, చివరకు ప్రతిపక్ష నాయకులు సుందరయ్యగారినికూడ తూలనాడి, ఏదో పేదలకు ఒరగబెడుతానన్న పెద్దమనిషికి, చవిటి పర్రలు సాగుచేస్తున్న పేదలకు పట్టాలు కూడ యివ్వడం చేతగాక, దేశం

ముందు తీరని అవమానానికి గురి అయ్యారు.

ప్రభుత్వ వాగ్దానాలమీదే ఆధార పడక ఒకటి రెండు సంవత్సరాలు ఈ సమస్యపై ఎడతెగని ఆందోళన పోరాటాలు నడిపితేగాని, యీ సమస్యను పరిష్కరించడం సాధ్యంకాదని గత చరిత్ర రుజువుచేస్తోంది

శ్రీ సుందరయ్యగారు నెల్లూరుజిల్లా ఇందుకూరుపేట బంజరు సాగుదార్ల సభలో చెప్పిన యీ క్రిందిమాటలు గమనించ తగివున్నాయి.

"బంజరుదార్లు సాగుచేసుకుంటున్న భూములనుండి వారిని గెంటివేయడం అక్రమమని కమ్యూనిస్టులు మహజర్లు పెట్టించారు. రాయబారాలు నడిపారు. ప్రదర్శనలు చేశారు శాసన సభలోను బయటూ ఆందోళనచేశారు అయినా యీ వుపద్రవం తప్పడం లేదు. బంజరు సాగుదార్లను తొలగించే ప్రమాదం ఎక్కువయింది. మరి యిక ఏమిచేస్తారని సాగుదార్లు అడుగుతున్నారు. ఇంటివద్ద కూర్చున్నారంటే అది మా పార్టీకి గౌరవం కాదు. అలా కూర్చుని వుండడం కమ్యూనిస్టుపార్టీ సభ్యుని లక్షణం కాదు. కాబట్టి యీ విషయంలో జైలుకుపోవలసివచ్చినా, లాఠీదెబ్బలు తినవలసివచ్చినా, మరేవిధమైన త్యాగం చేయవలసివచ్చినా కమ్యూనిస్టులు వెనుకంజ వేయరు. నిలబడి పోరాడి ప్రభుత్వంచే వెనకడుగు వేయించాలి. ఆ విధంగా యిటీవలనే రాజమండ్రిలో జరిగిన కమ్యూనిస్టు మహాసభ నిర్ణయించింది."



పుస్తక పరిచయం:

# కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగయంత్రాల పుట్టుక

ఫ్రెడరిక్ ఏంగిల్సు

తెనుగు అనువాదం:
మహీధర రామమోహనరావు

వెల: రెండురూపాయలు

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ-2.

మన భారతీయుల అభిప్రాయాల్ని పట్టి నూటతొంభయ్యయిదు కోట్ల సంవత్సరాలకు పూర్వం భూమి పుట్టింది. సృష్ట్యాదినుంచీ మనుష్యుడు కులాలు, వర్ణాలుగా విభజింపబడే వున్నాడు. సూర్యచంద్ర వంశాలకు చెందిన రాజులు రాజ్యాన్ని పాలిస్తు న్నారు. ఐదు వేల సంవత్సరాల క్రితం కలియుగం ఏర్పడ్డ తర్వాత వివిధ (బహు) రాజ వంశాల పరిపాలన ఏర్పడింది.

అల్లాగే పాశ్చాత్య దేశాలలో సృష్టి క్రమం గురించి బైబిలులో చెప్పిన అంశాల్ని నమ్మేశారు. బైబిలు ప్రకారం భూమి పుట్టి సృష్టి జరిగి క్రీస్తు పూర్వం నాలుగు వేల సంవత్స రాల క్రితం అని ఒక మత బోధకుడు తేల్చి చెప్పేడు.

ఇల్లాగే ప్రపంచంలోని వేర్వేరు ప్రాంతాలలో అభివృద్ధిపొందిన నాగరికతలు సృష్టిని గురించీ, మానవ సమాజం గురించీ, రాజ్యాలు, ఆస్తులూ గురించీ తమతమ ప్రత్యేక మైన ధోరణులలో ఆలోచించాయి. అవన్నీ మన కిప్పుడు అనవసరం.

మన భారతీయులు సృష్టిక్రమం గురించి చేసిన ఆలోచనలన్నీ మన పురాణాలలో పొందుపరచబడ్డాయి. ఆ పురాణగాధలు యధార్థమని విశ్వ సిస్తూ, అలా విశ్వసించని వారిని నాస్తికులని శ్రీ విశ్వనాధ సత్యనారా యణవంటివారు ఖండిస్తున్నారు. ఆలాగే 1880 నాటివరకూ పాశ్చాత్య దేశాలలో బైబిలును అక్షరశః నమ్ముతుండేవారు నమ్మని వారిని పాషండులని నిందిస్తూండేవారు తమ దృక్కోణంనుంచే ప్రపంచాన్నంతనూ చూసే. అలవాటూ, తమకంటె భిన్న మైన ఆలోచనల్ని సహించలేని స్థితీ ఈ నాటికంటె రెండు మూడువందల సంవత్సరాల క్రితం చాల ఎక్కువ.

ఇంగ్లండులో వచ్చిన పారిశ్రామిక విప్లవం, తత్ఫలితంగా యూరపియన్ సమాజంలో వచ్చిన మార్పులు, పరి

ణామాలు మానవుని ఆలోచనలను మొదలంటా కదలించివేశాయి. పరిణామవాదం సృష్టినీ, జీవజాలాన్నీ ఒక నూతన దృక్పథంలోంచి చూసేటట్లు చేశాయి.

ఈ పరిణామవాదాన్ని ప్రతిపాదించి, దానికి ఒక క్రమరూపం ఇచ్చినవాడు ఛార్లెస్ డార్విన్. ఏకకణ జీవం నుంచి, బహు సంక్లిష్ట నిర్మాణంగల ఈనాటి మానవ జీవివరకూ ప్రాణి క్రమశః మార్పులు చెందుతూ వస్తూందనేది ఆయన నిరూపణ. ఈ పరిణామం నిరంతర సంఘర్షణలో సాగిపోతూందనీ, ప్రకృతే జీర్ణమై కాలానికి సర్దుకోలేనివానిని నిర్మూలించివేస్తూందనీ, బలమైనవేవో నిలబడుతూవస్తున్నాయనీ ఆయన సూత్రీకరించాడు. జీర్ణమై, కాలానికి సర్దుకోలేనివి బలహీనములు. నిలబడగలిగినవి శ్రేష్ఠములు. ఈ సూత్రము ఆనాటి యూరపియను సమాజంయొక్క శ్రేష్ఠత్వాన్నీ, తద్వారా యూరపియనుల శ్రేష్ఠత్వాన్నీ ప్రకృతే నిర్ణయం చేసేసిందనే సంతృప్తినీ, భావనాబలాన్నీ కలిగించింది.

లేకపోతే ఇంగ్లీషువాళ్లూ, యూరపియనులూ అనాగరికులుగా జీవిస్తున్న కాలంనాటికే మహోన్నత నాగరికతను ప్రదర్శించిన భారతదేశం, చైనా, ఈజిప్టువంటివి పరాధీనం కావడం ఎందుకు తటస్థిస్తుంది ?

ఈ విధంగా సృష్టిక్రమంగురించీ రాజ్యాలు వాని నిర్మాణం గురించీ అంతవరకూ సమాజంలో ప్రచలితంగా వున్న విశ్వాసాలు మూలబడ్డాయి. పరిణామవాదం సామాజిక పరిస్థితులలో వచ్చిన మార్పుల్ని వ్యాఖ్యానిస్తూ, స్థూలంగా సమాధానం ఇస్తూ ఒక ప్రధానమైన తాత్త్విక ఆలోచనగా సర్వాంగీకారం పొందింది. దాని అర్థం డార్విన్ పరిణామవాదాన్ని అక్షరశః సత్యం అని స్వీకరించబడిందనీ కాదు. దానిని పాశ్చాత్య తాత్త్వికాలోచనగా భావించి, మన పురాణాల్నే నమ్మాలనేవారు లేకపోలేదనీకాదు.

అయితే సృష్టిక్రమాన్నీ, జీవజంతువుల వైవిధ్యాన్నీ, అభివృద్ధినీ అర్థం చేసుకొనేటందుకు డార్విన్ పరిణామవాదం తోడ్పడ్డట్లే, అదే కాలంలో మార్క్స్-ఏంగిల్సులు సమాజంయొక్క పరిణామం విషయంలోకూడ అటువంటి క్రమాభివృద్ధి సూత్రాన్నే చూపించారు. డార్విన్ వ్రాసిన 'ఆరిజిన్ ఆఫ్ స్పీషీస్' 1859 లో పూర్తిఅయినా, 1844 తర్వాత వ్యాసాలూ, ఉపన్యాసాలు రూపంలో ఈ ఆలోచనా ధోరణిని ప్రచారంలోకి తెచ్చాడు. మార్క్స్-ఏంగెల్సులు తమ ఆలోచనలను సూత్రప్రాయంగా వ్యక్తీకరిస్తూ "కమ్యూనిస్టు ప్రణాళిక"ను 1848 లో ప్రచురించారు.

అయితే వీరిని కారణజన్ములనీ, ఏ భగవానుడో ఓరోజున కలలోకనబడి 'వెర్రికుట్టల్లారా! ప్రపంచం అంటే ఇదిరా'యనిచెప్పి, దానిని ప్రచారంలో పెట్టేటందుకు వారిని జనం మీదికి ఎగతోలేడనీ అర్థం కాదు. జీవి,

సమాజం పరిణతిపొందుతున్నట్లే, మానవుని భావాలుకూడా ఒక క్రమ గతిలో పరిణామం పొందుతున్నాయే గాని, వేరు కాదు.

జీవ జాలంలో, ఒకే జాతికి చెందిన వానిలో మార్పులు వస్తున్నాయని గ్రహించడమే కాదు. దానికి శాస్త్రీయ మైన సమాధానాల నిచ్చే ప్రయత్నం కూడా 19 వ శతాబ్దారంభంలోనే ప్రారంభమైంది. లామార్క్ నే ప్రకృతి శాస్త్రవేత్త 1801 లో ఈ విషయమై మొదట వ్రాశాడు ఆలాగే మార్క్స్- ఏంగిల్సుల ఆర్థిక, రాజకీయ, తాత్విక అభిప్రాయాలు కూడా అంతకు పూర్వమే ఆలోచనలలో నలుగుతున్న భావాల పరిష్కృత రూపాలే.

ఇంతకీ – డార్విన్ పరిణామవాదం ప్రాతిపదిక మీద ఆనాటికి పాశ్చాత్య సమాజంలో ప్రముఖంగావున్న ఆస్తి (వ్యక్తిగత) వ్యవస్థ, కుటుంబ (దంపతీ వివాహ – మొనోగమీ) వ్యవస్థ, రాజ్యాంగ (ప్రజాతంత్ర) వ్యవస్థ ఉత్తమోత్తమాలనీ (లేకపోతే ఆ పాశ్చాత్య నాగరిక సమాజం మిగిలిన నాగరికతలన్నిటినీ నిర్జించి వుండ లేదు) అందుచేత అదే శాశ్వతంగా, స్థిరంగా ఉండేదనీ వాదించడం ప్రారంభమయింది. అంతే పరిణామాన్ని తమవరకే అనుమతించే ధోరణి వచ్చింది కాని, రెండోవేపున అంతవరకూ వచ్చిన పరిణామ క్రమాన్ని శాస్త్రీయంగా నిర్వచిస్తూ, సమాజ పరిణతికి పాశ్చాత్య నాగరిక సమాజం స్వస్తంతంకాదనీ, ఆ పరిణామం ఇంకా సాగుతుందనీ, గత పరిణామం ఫలానాక్రమంలో జరిగిందనీ,భవిష్యత్తులోకూడ అదే క్రమం కొనసాగితే ఫలితా లిల్లావుంటాయనీ వివరించి ఆ అభివృద్ధికోసం పోరాటాలు ప్రారంభమైనాయి.

19 వ శతాబ్దంలో యూరపులో ఈ విభిన్న భావధోరణుల సంఘర్షణ విశేష రూపంలో సాగింది. వారిలో లూయీ మోర్గన్ అనే అమెరికను మానవ శాస్త్రవేత్త (ఆంథ్రపాలజిస్టు) కుటుంబం ఏ యే రూపాలలో పరిణతి పొందిందో పరిశోధన చేశాడు. ఆయన అమెరికను ఆదినాసి తెగలలో ఒకటయిన ఇరాక్వ్యాలలో నలభైయేళ్లు నివసించి, సేకరించిన సమాచారాన్నీ, మిత్రులు. పరిచితులు, సహభావుకుల ద్వారా సేకరించిన ఆదిమతెగల, ప్రజల సమాచారాల్నీ పరిశీలించి ఆయన వ్రాసిన పుస్తకం ప్రాచీనసమాజం (ఏన్షెంట్ సొసైటీ)- 1877 లో ప్రచురించబడింది. అది ప్రాచీన సామాజిక రూపాల్ని గురించిన ఆలోచల్ని ఎంతో మార్చింది.

మోర్గన్ తన పరిశీలనలను ఈ విధంగా తేల్చేడు :

"కుటుంబం అనేది నాల్గుదశలు గడిచి అయిదో దశలోవున్నదని ఒప్పుకొంటే, ఈ దశమాత్రం స్థిరమాయనే ప్రశ్న వస్తుంది. దానికొక్కటే సమాధానం. గతంలోలాగానే భవిష్యత్తులోకూడ సమాజంలో మార్పు వచ్చినప్పుడల్లా అదీ మారుతుంది.

దానిని సామాజిక వ్యవస్థ సృష్టించింది. కనక సామాజిక సంస్కృతి దాని లోనూ ప్రతిబింబిస్తూంటుంది. నాగరిక యుగం వచ్చాక దంపతీ వ్యవస్థలో ఎంతో మార్పు వచ్చింది. ఈమధ్య నీమధ్య చాల ముఖ్యమైన అభివృద్ధి వచ్చింది. దీనినిపట్టి స్త్రీ – పురుషుల మధ్య సమానత్వం సాధించబడే టంతవరకూ దానిలో ఇంకా మార్పులు వచ్చే అవకాశం వుందను కోవచ్చు. సుదూర భవిష్యత్తులో దంపతీ వివాహం సామాజికావసరా లకుసరిపడకపోవచ్చు... దాని తర్వాత ఏ వ్యవస్థ వస్తుందో జోస్యం చెప్పడం అసాధ్యం."

సమాజంలో వచ్చిన మార్పుల్ని సూత్రీకరిస్తూ, ఆయన ఆదిమచరిత్రను మూడు యుగాలుగా విభజించేడు. ఆ యుగాల విభజన మానవుని ఉత్పత్తి విస్తరణ కనుగుణంగా వుందన్నాడు.

"భూమిమీద మనుష్యుని ఆధిక్యత ఈ విషయంలో (ఆహారోత్పత్తిలో) అతనికున్న చాతుర్యంమీదనే ఆధార పడి వుంది. ఆహారోత్పత్తిని పూర్తిగా తన స్వాధీనంలో పెట్టుకోగలిగిన ప్రాణి ఒక్క మానవుడే. జీవనాధార వస్తువుల విస్తరణా, మానవజాతి అభి వృద్ధిలో వచ్చిన ప్రధాన యుగాలూ కొంచెం ఇంచుమించుగా కలిసివున్నా యని చెప్పవచ్చును."

ఈ విధంగా మోర్గన్ కుటుంబం, సమాజంయొక్క పరిణామం వస్తూత్ప త్తికి సంబంధించి వున్నదనే అభిప్రా యానికి వచ్చాడు. వస్తూత్పత్తి గాక, ఉత్పత్తి సంబంధాలకు ముడిపడి వున్న దనేది దానితర్వాత మెట్టు. మార్క్స్-ఎంగెల్సులు ఆ మెట్టు యెక్కించేరు.

మోర్గన్ పరిశీలనా ఫలితాలు 19వ శతాబ్ద ఆలోచనా ధోరణులను బాగా రెచ్చగొట్టాయి. అంతవరకూపరిణామ వాదాన్ని ఆ నాటికున్న సామాజిక సంస్థల (వ్యక్తిగత ఆస్తి, దంపతీ వివాహం, ప్రజాతంత్ర రాజ్యాంగం) ఉత్తమత్వాన్నీ శాశ్వతంగా అను సరించవలసిన ఆవశ్యకతనూ ప్రబోధిస్తున్న జనం ఆదిమకాలంలో సమష్టి లక్షణాలుగల సమాజం వుందనీ, దానినుంచే ప్రస్తుత రూపాలు పరిణామం పొందాయని చెప్పడానికి ససేమిరా అంగీకరించలేక పోయారు. ప్రస్తుత సామాజిక రూపాల ఉత్తమ త్వాన్నీ, శాశ్వత స్థితినీ నిరూపించే టందుకు జంతువుల పరిస్థితి నుంచి కూడా వుదాహరణలు తెచ్చుకొనే టందుకు జంకలేదు. వారే విధంగా నైనాసరే—

వ్యక్తిగత ఆస్తి భావన జీవకోటికి సహజంగా అలవడే కోరిక. అదే సామాజిక జీవితానికంతకూ మూలం.

మతం వేపు మానవుని మనస్సు మొగ్గితీరుతుంది. అదో సహజమైన అలంబనం. పరిస్థితుల ప్రాభవంగాదు దానికి మూలం.

సంస్కృతికంతకూ మూలస్తంభం లాంటి కుటుంబం, అందులోనూ దంపతీ వ్యవస్థ (అనాటికి ప్రచలితంగా వున్న రూపం) మానవజాతి అనుస రించే ప్రధాన, ప్రాథమిక వ్యవస్థ –

అనే అభిప్రాయాలను సమర్థించే టందుకు విశ్వప్రయత్నాలు చేశారు. ఎడ్వర్డు వెస్టర్‌మార్క్ అనే లండన్ యూనివర్శిటీ ప్రొఫెసరు అవాకులు—చెవాకులూ, అర్థంలేని వ్యాఖ్యానాలతో, వాదనలతో మోర్గన్ వాదనలను వ్యతిరేకిస్తూ వ్యాసాలూ, పుస్తకాలు తెగవ్రాసేవాడు. మోర్గన్‌పుస్తకాలను దొరక్కుండా చేయడం, వెస్టర్ మార్క్‌ను బ్రహ్మరథం పట్టడం ద్వారా ఈ విషయంలో విజయం సాధించదలచేరు.

మోర్గన్ పరిశోధనలను మూలంగా ఎత్తుకొని ఫ్రెడరిక్ ఏంగిల్సు వ్రాసిన పుస్తకమే—

*కుటుంబం; వ్యక్తిగత ఆస్తి;*
*రాజ్యాంగ యంత్రాల పుట్టుక*

దీని నాయన 1884 లో వ్రాసేరు. ప్రధానంగా మోర్గన్ రచనను ఆధారంగా తీసుకొన్నా, ఆయన రచన అనంతరం బయటపడిన ఇతర సమాచారాన్ని, తాను పరిశీలించిన జర్మను, కెల్టు తెగల చరిత్రాంశాల్ని జతచేసి ఆయన ఈ రచనను పూర్తిచేశారు. దీని రచనలో తమను ప్రోత్సహించిన ప్రధానాభిప్రాయాన్ని ఆయన తన మొదటి ముద్రణ ఉపోద్ఘాతంలో ఇల్లా వివరించారు.

'ఒకవిధంగా చెప్పాలంటే, కారల్ మార్క్సు కోరికప్రకారం ఈ పుస్తకం వ్రాశాను. చరిత్రను భౌతికవాద దృక్పథంనుంచి పరిశీలనచేసి ఆయన, కొంతవరకు నేనుకూడా అని చెప్పుకోవచ్చు.—కొన్ని సిద్ధాంతాలకు వచ్చాడు. మోర్గన్ పరిశోధనా ఫలితాలకు ఆ సిద్ధాంతాలను అనువర్తింప చేసి, వాని ప్రాముఖ్యతను స్పష్టంగా చూపించాలని ఆయన ఒక పథకం వేసుకొన్నాడు.'

ఆయన జీవితకాలంలో పూర్తిచేయలేకపోయిన యీ బాధ్యతను ఆయన సేకరించిన సమాచారం ప్రాతిపదికగా తీసుకొని ఏంగెల్సు భర్తీచేశాడు.

మార్క్సు 'అదనపు విలువ' సిద్ధాంతానికున్నంత ప్రాముఖ్యత మోర్గన్ 'గణ నిర్మాణం' గురించిన పరిశీలనకుంది. గణాలనిర్మాణం, వానిలో అనుసరించబడిన, బడుతున్న వివాహ పద్ధతులు, వారసత్వపు పద్ధతులు ఎన్నికలు, పాలనవ్యవహారాలుగురించి ఆయన సేకరించిన సమాచారం అంతవరకూ తెలిసివున్నా, ఎంతో గందరగోళం కలిగిస్తున్న అనంత సమాచారాన్ని ఒక క్రమంలో చూపించింది.

ఆదికాలంలో మానవుడు వావులూ—నిషేధాలు ఎరగని స్వేచ్ఛా సంపర్కం కలిగివుండేవాడు. దానిని నిరూపించడానికి ఇప్పుడు ఆధారాలేవీ కనబడ్డంలేదు. కాని, స్త్రీ పురుష సంబంధాలలో వచ్చిన పరిణామం దృష్ట్యా అటువంటి దశ ఒక నాడున్నదని భావించవచ్చు.

అటువంటి స్వేచ్ఛా సంపర్కంలో నిషేధాలను ప్రవేశపెట్టినదాది నేటి వరకూ వివాహం నాలుగు దశల్ని గడిచింది. రక్త సంబంధీకుల కుటుంబం.

1. ప్యునలాన్ కుటుంబం 2. జంట కుటుంబం 3. దంపతీ కుటుంబం. 4.

ఈ పరిణామాన్ని చారిత్రక భౌతిక వాద దృష్ట్యా వివరిస్తూ, దీనికి సమాజంలో వస్తున్న ఉత్పత్తి సంబంధాల మార్పులకూగల సన్నిహిత సంబంధాన్ని ఏంగిల్సు వివరించారు.

వ్యక్తిగత ఆస్తి ఏ విధంగా గణాల సమష్టి ఆస్తినుంచి ఎంత సహజంగా పరిణామం చెందిందో, దీనికి వుత్పత్తి సాధనాల మార్పునకూ ఎటువంటి సంబంధం వుందో ఆ ఆస్తి హక్కు ఏర్పడడం గణవ్యవస్థనే విచ్ఛిన్నం చేసిందో ఈ పుస్తకం చాల నిశితంగా తెల్పుతూంది.

వ్యక్తిగతమైన ఆస్తి హక్కు ఏర్పడడంతో అంతవరకూ గణంలోవున్న స్త్రీ ప్రాముఖ్యం అంతరించి తండ్రి పరంపర పరిగణనలోకి వచ్చింది. స్త్రీ జాతి పొందిన అతి ప్రధానమైన పరాజయంగా దీనిని ఏంగిల్సు వర్ణించారు. ప్రపంచ చరిత్రనే మార్చివేసినంత ప్రాముఖ్యం దీనికుంది.

ఈ దశలో సమాజంలోవచ్చిన మార్పుల్ని ఏర్పుల్ని ఎంగిల్సు ఈ విధంగా వర్ణిస్తున్నారు.

"తండ్రి హక్కు ఏర్పడింది. మగవాని సంతానానికే ఆస్తి వారసత్వం వచ్చింది. దానితో కుటుంబంలో ఆస్తి పోగుపడింది. ఆ ఆస్తిబలంతో గణంకన్న కుటుంబం దృఢపడింది. ఆస్తిలో హెచ్చుతగ్గులతో సాంఘిక నిర్మాణంలోకూడ మార్పువచ్చింది. వంశక్రమాగతమైన కులీన వ్యవస్థకూ, రాజరికానికిప్రాతిపదికలు ఏర్పడ్డాయి. బానిసత్వం ప్రత్యక్షమయింది. మొట్టమొదట యుద్ధఖైదీలకు మాత్రమే ఇది పరివ్యాప్తం. క్రమంగా తమ తెగలోనివారినీ, తమగణంలోని వారినీ కూడ బానిసల్నిచేయసాగేరు పూర్వం తెగలమధ్యనే ఘర్షణలుండేవి. ఇప్పుడు జీవనాధారం కోసం పశువుల్నీ, బానిసల్నీ ఇతరసంపదల్నీ దోచితెచ్చుకొనేటందు కోసం పనికట్టుకొని దాడులూ, దండ యాత్రలూ సాగిస్తున్నారు. సంగ్రహంగా చెప్పాలంటే సంపదలకు మెప్పులభించింది. ధనం సర్వసమ్మ్రన్యం అయింది. సంపదలను బలాత్కారంగా దోచుకొనేటందుకు వెనుకటి గణసంఘం అంగాలనే వుపయోగించుకొంటున్నారు. అప్పటికున్న లోపం ఒక్కటే, గణసంఘంలోని సామూహిక పద్ధతులకు వ్యతిరేకంగా వ్యక్తులు పోగుచేసుకొన్న ఈ కొత్త సంపదలను కాపాడే వ్యవస్థ కావాలి. గతంలో ఎంతో చులకనగా చూసే వ్యక్తిగత ఆస్తిని పవిత్రమైనదిగా స్థిరపరచాలి. ఆ పవిత్రతను కాపాడడమే మానవ సమాజంయొక్క ప్రధాన గమ్యంగా ప్రకటించాలి. అంతేకాదు కూడా. ఆస్తులు సంపాదించేటందుకు అనుసరిస్తున్న నవీన పద్ధతులకు, సంపదల నిరంతరాభివృద్ధికి సమాజంయొక్క ఆమోదం లభించాలి. సమాజంలో తలఎత్తుతున్న వర్గవిభజననే కాకుండా, ఆస్తిపరులవర్గం ఆస్తిలేనివర్గాలను దోచు

కొని, పాలించే హక్కును కూడా శాశ్వతంగా సాగనిచ్చే సంస్థ కావాలి. "ఆ మాదిరి సంస్థ ఏర్పడింది." రాజ్యాంగం" సృష్టించబడింది.

[కుటుంబం,....పుట్టుక]
తెనుగు అనువాదం,పుటలు 164-165

ఇది సర్వసామాన్యమైన స్థూల సమాచారం. 'రాజ్యాంగం' ఎందుకు ఏర్పడింది? అనే విషయంలో తభావతులేదు. ఏ విధంగా ఏర్పడింది? అనే విషయాలు ఆయా ప్రజలున్న అభివృద్ధి దశల్నిపట్టీ, ఆ పరిస్థితుల్ని పట్టీ భేదస్తూంటాయి.

ఏంగెల్సు తన పుస్తకంలో రాజ్యాంగ యంత్రం అధీనియన్లలో, రోమన్లలో, జర్మన్లలలో ఏవిధంగా ఏర్పడిందో చూపించారు.

తొమ్మిదో ప్రకరణం అనాగరికత: నాగరికత అనే దానిలో మొదటి ఎనిమిది ప్రకరణాలలో సవివరంగా చూపించిన అంశాలను క్రోడీకరిస్తూ, మొత్తం సమాజంలో వచ్చిన అభివృద్ధిని - అనాగరిక యుగంలోంచి నాగరికతలోకి మార్పును తెచ్చిన అభివృద్ధిని- ఆయన చాల విశదంగా వ్రాశారు.

అయితే, ఈ పుస్తకం ఎంత ప్రధానమైనదైనా దాని పరిమితులు దానికున్నాయి. అందులో ముఖ్యమైనదీ, ప్రధానమైనదీ - ఏంగిల్సు దీనిలో అమెరికను ఆదివాసుల, గ్రీకు, రోమను, జర్మను ప్రజల చరిత్రను వివరించారు.

ఆయన చరిత్రలో అంతవరకూ సమన్వయం కుదరని ఆచారాలూ, అలవాట్లూ మొదలయిన వానిని అర్థం చేసుకొనేందుకు ఒక పంథా చూపించారు. ప్రతిజాతి చరిత్రలోనూ సమన్వయం చూపవలసిన ఘట్టాలూ, ఘటనలూ చాలా వున్నాయి. వానిమీద ఆయా సాహిత్యాలలో బోలెడంత తర్జన భర్జనలు జరుగుతున్నాయి. మన తెలుగు బాషలో కూడ ఈ గంద్రగోళం తక్కువేంలేదు. భారతం, భాగవతం,రామాయణం మొదలైన ప్రాచీన గ్రంథాలలోని కథల్ని ఎల్లా అర్థం చేసుకోవాలి? మన 'మత ప్రవక్తల బోధనలలో, ధర్మశాస్త్రాలలో వున్న వైరుధ్యాలకు కారణం ఎక్కడుంది? మనుస్మృతా? పరాశరస్మృతా? ఇంగ్లీషువాళ్ళ పీనల్ కోడా - ఏది మనకు ఆలంబం?—ఎన్నో సమస్యలు అన్నీ సమస్యలే. వీటిమీద తిట్టుకొని కోర్టుల కెక్కిన రోజులున్నాయి. ఈనాటి స్థితి వేరు.

ఈ విషయాలను పరిశీలించి, సమన్వయపరుస్తూ పరిశోధన గ్రంథాలు రాకపోవడం మనలో ఒక పెద్ద లోటుగావుంది. ఈ అవకాశాన్ని తీసుకొని మిగిలిన ప్రపంచప్రజలకన్న భారతీయులు ఏదో ఒక కొత్త ప్రత్యేక తరహా జనం అన్న దురహంకారాన్ని ప్రచారంలో పెట్టడానికి కొందరు ప్రయత్నాలు సాగిస్తున్నారు. సమాజంలో పాతుకుపోయివున్న వ్యవస్థను మార్చేటందుకు చేసే ప్రయత్నాలన్నీ విజాతీయమనీ, వైదేశీయమనీ, అనడం

ఛాందసుల కో అలవాటు. కుల, వర్ణ భేదాన్ని పాటించరాదన్న బుద్ధుణి అసలు భారతీయుడే కాదని నిరాక రిస్తూ, ఆ విషాన్ని సాధారణప్రజల మనస్సుల కెక్కించేటందుకు నవలలు, నాటకాలు మొదలయిన ప్రజాసాహిత్యంలోకి పనికట్టుకొని చొప్పిస్తున్న కొందరు పెద్దలను ఈ విషయంలో వుదాహరణగా చూపుతున్నా.

మన దేశ - జాతి చరిత్రను సమన్వయంచేస్తూ సాహిత్యంరావడం అతి ముఖ్యం. అలా వచ్చినప్పుడు ఏంగిల్సు వ్రాసిన ఈ పుస్తకం వంటిది వ్యంజనాలుగా మన కుపయోగపడతాయి. కాని, ఇప్పు డీ వ్యంజనమే మన మెదడుకి ప్రధానమైన ఆహారం అయింది. అందుచేత అనువాదాలలోవుండే ఇబ్బందులు, అసలువిషయం కొత్తదికావడానికి తోడ్పడి, అత్యవసరమైన ఈ విషయాన్ని, గ్రంథాల్ని దురవగాహన చేస్తున్నాయి.

మన దేశంలోనే ఈ నూదిరి ఆలోచనా పద్ధతిని అవలంబించి మన జాతి చరిత్రను సమన్వయించేటందుకు జరిగిన ప్రయత్నాలు చాల తక్కువ. శ్రీ ఎస్. ఏ. డాంగే వ్రాసిన భారతదేశం (ఆదిమ కమ్యూనిజం నుంచి బానిసత్వం వరకు) అనే పుస్తకం ఒకటీ, శ్రీ డి డి. కోశాంబీ వ్రాసిన "ఇంట్రుడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ" అనేదీ ఈ లోపాన్ని చాల కొద్దిగా పూడుస్తున్నాయి. వానిలో మొదటిది మాత్రమే తెలుగులోకి వచ్చింది.

మన ప్రాచీన సాహిత్యాన్ని మన వివాహచారాలను తాత్విక భావనలను, చరిత్రను చారిత్రక భౌతిక వాద దృష్ట్యా పరిశీలిస్తూ 'సందేశం' ప్రకటించిన కొన్ని వ్యాసాలుతప్ప - అవీ అసమగ్రంగా వున్నాయి- ఈ విషయంలో శ్రద్ధ తీసుకోబడలేదు అని చెప్పాలి. ఈ అశ్రద్ధ ఈ వేళ మన సంస్కృతీ రంగంలో చాల ప్రమాదకరమైన ధోరణులు ప్రవేశించడానికి కారణభూతం అవుతూంది.

త్వరలోనే ఆ ప్రమాదంనుంచి బయటపడేటందుకు సర్వతోముఖ ప్రయత్నం అవసరం.

★

Regd. No. A 202 SANDESAM Re. 0.50


# మూడు పుస్తకాలు

## జ్ఞాన సిద్ధాంతం

రచన : మారిస్ కారన్‌ఫోర్త్

అనుసరణ : పాములపర్తి సదాశివరావు

మనస్సు, దాని విస్తృతీ - పరిధి, ఆలోచనలూ, జ్ఞానం గూర్చిన తాత్త్విక సిద్ధాంతాలను చర్చించిన ప్రామాణిక గ్రంథం.

340 పుటలు. వెల : రు. 3.75.

## కుటుంబం, వ్యక్తిగత ఆస్తి, రాజ్యాంగాల పుట్టుక

రచన : ఫ్రెడరిక్ ఏంగిల్సు

సమాజ విజ్ఞానంగురించిన మార్క్సిస్టు ప్రామాణిక గ్రంథాలలో ఉత్తమోత్తమం.

270 పుటలు. వెల : రు. 2.00

## నా స్మృతిపథంలో లెనిన్

రచన : క్లారా జెట్కిన్

ముఖ్యంగా మహిళలు, స్త్రీ-పురుష సంబంధాలు గురించిన మార్క్సిస్టు దృక్పథాన్ని - జర్మను కమ్యూనిస్టు నాయకురాలు క్లారా జెట్కిన్ లెనిన్‌తోడి సంభాషణలలో సేకరించి వ్రాసిన ఈ పుస్తకం తప్పక చదవవలసి వుంది.

140 పుటలు. వెల : రు. 1.00

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ - 2.


Edited, Printed and Published by G. Radhakrishnamurty.
Printed at Swatantra Art Printers, Vijayawada.

